TPLA108B112

# చైనా వీరగాధలు

రచన:

కె. సిమొనోవ్

అనువాదం:

పరుచూరి కోటేశ్వరరావు

విశాలాంధ్ర ప్రచురణాలయం,

విజయవాడ-2.

# ముందు మాట

సోవియట్ మేధావులం కొందరం కలసి 1949 లో చైనాలో పర్యటించాము. పెకింగ్‌లో జరిగిన ప్రజారిపబ్లిక్ అవతరణోత్సవంలో పాల్గొన్నాము. అటుపిమ్మట షాంఘై, నాంకింగ్, ట్సినాన్, టీక్సటిన్, ముక్డెన్, హార్బిన్ నగరాలను సందర్శించాము. అనేక కర్మాగారాలను, పరిశ్రమలను తిలకించాం. రైతులు, కూలీలు, కార్మికులు, విద్యార్థులు, మేధావులు వేలాదిగా హాజరైన బహిరంగసభలలో ప్రసంగించాము.

ఆ పర్యటన సందర్భంలో మేము పొందిన అపూర్వానుభూతులు చిరస్మరణీయాలు. ఒక మహాదేశం, ఒక మహత్తర జాతి బానిస బంధంనుంచి శాశ్వతంగా విముక్తమైంది. స్వేచ్ఛ పొందినందుకు వారు ఎంతగా సంబరపడ్డారో మేము కళ్లారా చూసాము.

నవచైనాను గురించి వ్రాయటం అంటే కమ్యూనిస్టు పార్టీనిగురించీ, చైనాదేశ కార్మిక కర్షకులనుగురించీ, ఆ దేశ వృత్తిదారులనుగురించీ, ప్రజావిముక్త సైన్యం గురించీ వ్రాయటమే అవుతుంది. ఆయావిషయాలపై వ్రాయవలసివస్తే అనేక గ్రంథాలను రచించవలసి ఉంటుంది.

నేనిప్పుడు ప్రజావిముక్త సైన్యంగురించి మాత్రమే ఈ గ్రంథంలో వ్రాస్తున్నాను. కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన చైనావిప్లవంలో ఆ సైన్యం అత్యంత నిర్ణయాత్మకమైన పాత్రను నిర్వహించింది. చైనా ప్రజావిముక్త సైన్యం

చరిత్ర వ్రాస్తే, చైనా విప్లవ చరిత్ర అంతా ప్రస్తావించినట్లే అవుతుంది. గతంలో ప్రజావిముక్త సైన్యం సాధించిన కొన్ని విజయాలను గురించి చైనా కామ్రేడ్స్ ద్వారా తెలుసుకొన్నాను. మరికొన్నిటిని నా కళ్ళారా చూసాను. ఆ విజయాల చరిత్రను ఇందులో పొందుపరిచాను.

మా ప్రతినిధివర్గ పర్యటన ముగిసినతర్వాత, నేను 'ప్ర వ దా' విలేఖరిగా యుద్ధరంగంలో కొంతకాలంపాటు ఉంటూ, ప్రజాసైన్య పోరాట పాటవం పరిశీలించాను.

దాదాపు ఇప్పటికి నా చైనా పర్యటన ముగిసి సంవత్సరం దాటిపోయింది. ఈ మధ్యకాలంలో ప్రజాతంత్ర చైనా అంతిమ విజయం సాధించింది; దేశం యావత్తు విముక్తమైంది. చైనాప్రజలు పునరుజ్జీవనంపొంది, పునర్నిర్మాణ కార్యక్రమానికి ఉపక్రమించారు.

చరిత్ర ప్రసిద్ధమైన ఆ సంఘటనలను కళ్లారా చూసే మహద్భాగ్యం నాకు లభించినందుకు నిజంగా నేను గర్వపడుతున్నాను. చైనా ప్రజల భవిష్యత్తును మాత్రమేగాక, స్వాతంత్ర్యంకోసం పోరాటం సాగిస్తున్న ఇతర ఆసియాప్రజల భావి జీవితాలను తీర్చి దిద్దటానికి ఆ సంఘటనలు ఇతోధికంగా కారణభూతం కాగలవు.

— ర చ యి త

# ఒకటో భాగం

## 1

నవంబరు 7, 1949. ఉత్తర, మధ్యచైనాలలో మా పర్యటన ముగిసింది. దక్షిణచైనాను చేరుకొన్నాము. 'ప్రవదా' విలేఖరిగా చైనా ప్రజాసైన్య పోరాట పటిమను పరిశీలించ బోతున్నాను.

హెంగ్‌యాంగ్ పట్టణానికి చేరుకొని మూడుగంటలయింది. సూర్యాస్తమయం అయింది. చీకటి పడుతోంది. వర్షం కురుస్తోంది. దక్షిణచైనాలో యుద్ధచర్యలనుసాగిస్తున్న ప్రజాసైన్యంపేరు నాల్గవ పదాతిసైన్యం. ఆ సైన్యంయొక్క కేంద్ర కార్యాలయం ప్రస్తుతం హెంగ్‌యాంగ్ పట్టణంలోఉంది. ఆ సైన్యానికి సారథ్యం వహిస్తున్న కామ్రేడ్ లిన్ పోను రేపు సందర్శిస్తాను. నా మకాం ఒక చిన్న మేడ పైభాగంలో. నాకు ఎదురుగా ఉన్న కిటికీలోగుండా చూస్తున్నాను. అమెరికన్ దుస్తులు ధరించిన ప్రజాసైనికుడు పహరా ఇస్తున్నాడు.

హార్బిన్, ముక్డెన్, పెకింగ్, ట్సినాన్, నాంకింగ్, షాంఘైనగరాలు వరుసగా నా స్మృతిపథంలోమెరుస్తున్నాయి. ఆయా నగరాలలో మేము పొందిన అపూర్వానుభూతులు

స్ఫురణకు వస్తున్నాయి. సోవియెట్ ప్రజలపట్ల చైనా ప్రజా నీకం ప్రదర్శించిన ప్రగాఢమైన ప్రేమ మమ్మల్ని ముగ్ధుల్ని కావించింది. చైనాప్రజారిపబ్లిక్‌ను సోవియట్‌రష్యా గుర్తించిం దన్న వార్తతో చైనాప్రజలుపొందిన ఆనందానికి అంతులేదు.

అక్టోబరు 1 వ తేదీ, రిపబ్లిక్ అవతరణోత్సవం మహా వైభవోపేతంగా జరుగుతోంది. పెకింగ్ ప్యాలెస్ ముందు నవచైనా ప్రజా సైనిక విన్యాసం. అమెరికన్ దుస్తులను, ఆయు ధాలను ధరించింది ప్రజాసైన్యం. ఆ సైనికవిన్యాసం తిలకిస్తుంటే కామ్రేడ్ మావో సే-టుంగ్ వ్యంగ్యంగా విసరినమాటలు గుర్తొస్తున్నాయి. "వాషింగ్టన్ మాఆయుధాగారం. చాంగ్ కై షేక్‌మాకు ముఖ్య సప్లయిదారు."

చాంగ్ కై షేక్ అంటే గుర్తుకొచ్చింది. సైనిక విన్యా సంలో పాల్గొంటున్న ప్రజాసైనికులు ఉన్నట్టుండి విరగబడి నవ్వ సాగారు. అలా ఎందుకు నవ్వుతున్నారో నాకు అర్థంకాలేదు. బక్క-చిక్కి-న కుక్క-ఒకటి ఎక్క-డనుంచో వచ్చింది. నూతన రిపబ్లిక్ గౌరవార్థం మొదటిఫిరంగి పేలింది. ఆ కుక్క-కాళ్ళు వణకసాగాయి. రెండవఫిరంగి పేలింది. తోకముడిచి ఆకుక్క- పలాయనం సాగిస్తోంది. ఇంతలోకి ఎవరో అన్నారు: "అడుగో చూడండి చాంగ్ కై షేక్!" ఆ మాట, ఆనోట ఆనోట జన సందోహానికి చేరింది. అందుకే ఆ నవ్వు! నా ప్రక్క-నే నిలబడ్డ చైనాసోదరుడు అన్నాడు: "హడావిడిగా ఫార్మోజాకు పారి పోతున్నాడు."

అవును. నెలరోజులు గడిచిపోయాయి. ఆ మాట అక్షరాలా నిజమైంది. చైనా నడిగడ్డపై నిలవ నీడలేని చాంగ్ కై షేక్ ఫార్మోజాద్వీకే పారిపోయాడు.

ఉత్తర, మధ్యచైనాప్రాంతం విముక్తమైంది. ఇకదక్షిణ చైనాను ప్రజాసైన్యం విముక్తంచేయాలి. దక్షిణచైనాలో నాల్గవ, రెండవ పదాతి ప్రజాసైన్యాలు యుద్ధం కొనసాగిస్తున్నాయి.

రెండవ పదాతిసైన్యానికి సారథ్యంవహిస్తున్న జనరల్ లి పో చెంగ్‌ను గతరాత్రి తలవని తలంపుగా కల్సుకున్నాను. హెంగ్‌యాంగ్ పట్టణానికి వస్తూ, చాంగ్షాపట్టణంలో కొంతసేపు ఆగాను. జనరల్ లి పో చెంగ్ గౌరవార్థం జరిగిన విందుకు హాజరయ్యాను.

జనరల్ లి పో చెంగ్ తుపాకి చేతపట్టి రెండు దశాబ్దాలు దాటింది. విశ్రాంతి అంటే ఏమిటో యెరుగని కార్యవాది. లి పో చెంగ్ అంటే కుమింగ్‌టాంగ్ సేనానులకు సింహస్వప్నం. సాధారణ ఆహ్వానితునివలె ఒకమూల కూర్చున్నాడు ఆ నిరాడంబరజీవి. తీరికసమయాలలో ఆయన అనేక సోవియట్ సైనికగ్రంథాలను చైనాభాషలోకి తర్జుమా చేసేవాడు. దాదాపు యుద్ధరంగంలో పదిసార్లు గాయపడ్డాడు.

కామ్రేడ్ లి పో చెంగ్ తన యుద్ధరంగానికి వెళ్ళిపోతున్నాడు. చిరునవ్వు చిలకరిస్తూ "మీరు వీలుచేసుకొని మా సైన్యాన్నికూడా సందర్శించండి. మీరు వచ్చేటప్పటికి మాసైన్యం చుంకింగ్‌పై ముట్టడిజరుపుతూ ఉంటుంది. సెలవు."

సతీ సమేతంగా వెళ్ళిపోయాడు. దీర్ఘకాల సైనిక జీవితంలో ఆయన భార్య ఆయనకు సహధర్మచారిణిగా వ్యవహరిస్తోంది.

# 2

పెకింగ్ నుంచి పుకౌనగరానికి వెళ్తున్నాను. అది షుచౌ ప్రాంతం. చైనా విప్లవచరిత్రలో ఆ ప్రాంతానికి విశిష్ట ప్రాముఖ్యం ఉంది. "హ్యు ఆయ్‌హాయ్" అనే ప్రసిద్ధయుద్ధం జరిగింది ఆ ప్రాంతంలోనే. మధ్యచైనాలో గల ప్రధాన కుమింగ్‌టాంగ్ బలగాలను ఆ యుద్ధంలోనే ప్రజాసైన్యం తుడిచిపెట్టింది. ప్రజాసైన్యం యాంగ్‌ట్సీ నదిని అధిగమించటానికీ, నాంకింగ్, షాంఘై నగరాలను హస్తగతం చేసుకోటానికీ ఆ యుద్ధంలో పొందిన విజయమే ప్రధానకారణం.

కామ్రేడ్ లి పో చెంగ్ నాయకత్వాన రెండవపదాతిసైన్యం ఆ ఘనవిజయాన్ని సాధించింది. ఆ యుద్ధంలో ప్రజాసైన్యం అంతటివిజయాన్ని ఎలా సాధించగలిగిందని ప్రశ్నించాను. అందుకు చైనా కామ్రేడ్స్ చెప్పిన సమాధానమిది :

కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన మేము పోరాడటం మా విజయానికి మొదటికారణం. ముఖ్యంగా కామ్రేడ్ మావో సే-టుంగ్, మొదటినుంచి మమ్మల్ని హెచ్చరిస్తూనే ఉన్నాడు : "దీర్ఘకాల యుద్ధానికి సిద్ధంకండి. కుమింగ్‌టాంగ్ సైనికబలాలు యాంగ్‌ట్సీనది దాటి పోకుండా జాగ్రత్త పడాలి."

ప్రజాసైన్యానికి నాయకత్వం వహించిన సైనికాధికారులు యుద్ధరంగపరిస్థితిని ఎప్పటికప్పుడు సరిగా అవగాహన చేసుకుంటూ ఎత్తుగడలను మార్చుతూవచ్చారు. ఇది రెండవ కారణం.

సైనికచర్యలలో నిగ్గుతేరిన ప్రజాసైనికోద్యోగులు చొరవతో పోరాడారు. ఇది మూడవకారణం.

ప్రజాసైన్యంలో సౌహార్ద్రభావం మెండుగా ఉండటం నాల్గవకారణం.

ప్రజాసైన్యానికి ప్రజలు సర్వవిధాల సహాయపడ్డారు. ఇది ఆఖరుకారణం. అత్యంత ముఖ్యమైనకారణం.

ఏ సైన్యమైనా సైనికచర్యలను జయప్రదంగా నిర్వహించటానికి మూడు ముఖ్య సమస్యలను పరిష్కరించుకోవాలి. ఆహారపదార్థాల సరఫరా, ఆయుధసామగ్రి సరఫరా, అదనపు బలాలను ఒనగూర్చుకోవటం. ఈ మూడు సమస్యలను ప్రజాసైన్యం చాల్లా అవలీలగా పరిష్కరించుకుంది.

అష్టకష్టాలకు ఓర్చి ప్రజలే ప్రజాసైన్యానికి ఆహారపదార్థాలను సరఫరాచేసిపెట్టారు. శత్రుసైనికులనుంచి ఆయుధసామగ్రిని కావలసినంత వశపరచుకొన్నారు. వేలాది శత్రుసైనికులు వచ్చి,స్వచ్ఛందంగా ప్రజాసైన్యంలో లీనం కావటంతో అదనపుబలాల సమస్య తీరిపోయింది.

చాంగ్షానుంచి హెంగ్‌యాంగ్‌పట్టణానికి ప్రయాణం చేస్తున్నాము. దారిపొడుగునా కుమింగ్‌టాంగ్ యుద్ధఖైదీలు బారులుదీరి దక్షిణాభిముఖంగా పోతున్నారు. ప్రజాసైన్యం వారినివదలి పెట్టింది. ఎవరిఇళ్ళకు వారు పోతున్నారు.

సియాంగ్ కియాంగ్‌నదినిదాటి, సియాంగ్‌టంగ్ పట్టణం చేరుకొన్నాము. హూన్యానాన్ రాష్ట్రంలో అదొక చిన్నపట్టణం. నవచైనా అధినేత కామ్రేడ్ మావో సే-టుంగ్ జన్మస్థలం ఆ పట్టణానికి కొన్నిమైళ్ళదూరంలోఉంది. కామ్రేడ్ మావో

చదువుకొన్నదీ, విప్లవజీవితాన్ని ప్రారంభించిందీ సియాంగ్ టంగ్ పట్టణంలోనే.

ప్రస్తుతం దక్షిణచైనాలో ప్రజాసైన్యం సాగిస్తున్న జైత్రయాత్రకు సైనికవ్యూహం రచించింది కామ్రేడ్ మావో సే-టుంగ్. ఆ సైనిక వ్యూహాన్ని గురించి తన సహచరులకు కామ్రేడ్ మావో ఇలా వివరించాడు :

"అడకత్తెర వ్యూహంతో మనం దండయాత్ర ప్రారంభించాలి. ఒకసైన్యం తూర్పుదిశనుంచి బయలుదేరి పశ్చిమాభిముఖంగా పురోగమించాలి. రెండవసైన్యం ఉత్తర దిక్కునుంచి బయలుదేరి, దక్షిణాభిముఖంగా పురోగమించి, వియత్నామ్ సరిహద్దునుంచి కుమింగ్‌టాంగ్ బలగాలను వేరుచేయాలి. మూడోసైన్యం ఈశాన్యదిశనుంచి నైరుతి దిక్కుగా పురోగమించి చాంగ్షా, హెంగ్‌యాంగ్, క్వీలిన్ పట్టణాలను హస్తగతం చేసుకోవాలి. అప్పుడు చుంకింగ్, చెంగ్టూ, కున్మింగ్ పట్టణాలు మన వశమవుతాయి"

సియాంగ్ కియాంగ్ నదిని దాటుతున్నప్పుడు ఈ విషయాలన్నీ గుర్తుకొచ్చాయి. అంతేకాదు. చైనా విప్లవచరిత్రలో ప్రజాసైన్యంపాత్ర చాలా ప్రధానమైంది. అలాంటి ప్రజాసైన్యం అవతరించిన పవిత్రస్థలంకూడా సియాంగ్‌టంగ్‌కు కొన్నిమైళ్ళ దూరంలోనేఉంది. కొన్నిసంవత్సరాలక్రితం సింగ్ కాంగ్ షాన్ అనే ప్రదేశంలో కామ్రేడ్ మావో సే-టుంగ్ ఆధిపత్యంగల సైనికదళం, కామ్రేడ్ ఛూటే నాయకత్వంగల సైనికదళం మొట్టమొదటి సారిగా చేతులుకలిపాయి.

ఆనాటినుంచి ఈనాటివరకు ఆ రెండు సైనిక దళాలు ఆయుధాలను క్రిందకు దించలేదు.

నెలలు, సంవత్సరాలు గడిచిపోయాయి. "ఇంతింతై వటుడింతై" అన్నట్లు ఆ ప్రజాసైన్యం దినదిన ప్రవర్ధమానమై చైనాదేశ రూపురేఖలనే మార్చగల్గింది. నియంత చాంగ్ కై షేక్ హంతకముఠాను మట్టుపెట్టింది. ప్రపంచంలోకల్లా బలమైన అమెరికన్ సామ్రాజ్యవాదులకు బుద్ధిచెప్పింది.

నవంబరు 7 అర్ధరాత్రి. ఒక చిన్నగదిలో కూర్చున్నాను. మాస్కోగుర్తుకొచ్చింది. అందులో నవంబరు 7 వ తేదీ గుర్తుకు రాకుండా ఎలా ఉంటుంది ?

మాస్కోలో ఉదయం 6 గంటలు అయిఉంటుంది. నవంబరు విప్లవదినోత్సవాన్ని మహదానందంతో అక్కడి పౌరులు జరుపుకొంటుంటారు.

నూతన యుగానికి నాందీవాచకం పలికింది ఆ మహత్తర నవంబరు విప్లవమే; రష్యాలో సోషలిజం జయప్రదం కావటంతో ప్రపంచ విప్లవోద్యమం జాంబవంతుని అంగలు వేసుకుంటూ ముందుకుసాగింది. ఈ విషయాన్ని చైనాప్రజానీకం స్పష్టంగా గ్రహిస్తోంది.

చైనా విప్లవచరిత్రలోకూడా చిరస్మరణీయమైన పర్వదినాలు, పవిత్రస్థలాలు ఉన్నవి. ప్రజాసైన్యం అవతరించిన సింగ్ కాంగ్ షాన్ పర్వతప్రాంతం ఉంది. ఏ కొండగుహల్లో పార్టీ కార్యకర్తలు రాజకీయ శిక్షణపొంది రాటుతేలారో, ఆ ఏనాన్ కొండ గుహలు ఉన్నాయి. అలాగే చైనాప్రజలకు కొన్ని దుర్దినాలున్నాయి. షాంఘై, నాన్ చాంగ్ తిరుగుబాట్లు

దారుణంగా రక్తపాతంలో ముంచెత్తబడ్డ రోజులే ఆ దుర్దినాలు. కుమింగ్‌టాంగ్ కబంధహస్తాలనుంచి తిరిగి ఆ పట్టణాలు విముక్తమైన రోజులే పర్వదినాలు. నూతనశకానికి నాందీవాచకాలు.

## 3

నవంబరు 8. క్రామేక్ లిన్ పోను కల్సుకోటానికి బయలుదేరాను. సరికొత్త అమెరికన్ జీపులో ఎక్కాను. ఈ సందర్భంలోనే ఒకవిషయం చెప్పాలి.

అమెరికన్ సామ్రాజ్య వాదులు కొన్ని కోట్లరూపాయల విలువచేసే ఆయుధ సామగ్రిని అడుగు ఊడ్చిన చాంగ్ కై షేక్ జేబులో కుమ్మరించారు. ఆ సహాయవాహిని సరాసరి ప్రజాసైనిక సంద్రంలో కలిసిపోయింది. ప్రజాసైన్యంవద్ద ఉన్న ప్రతివస్తువూ – కారూ, తుపాకీ, ఫిరంగీ, టెలిఫోనూ, మందుగుండూ, దుస్తులూ – సమస్తం అమెరికన్ సరుకే. "తానొకటి తలిస్తే, ప్రజలొకటి తలిచినట్లు" జరిగింది.

మళ్ళీ అసలు విషయానికి వద్దాం. హెంగ్‌యాంగ్ పట్టణ వీధులగుండా ప్రయాణంచేస్తున్నాను. ఆపట్టణం విముక్తమై 20 రోజులుపైగా దాటింది. అయినా ఆ వీధులు ఇంకా నిర్మానుష్యంగానే ఉన్నాయి. భయవిహ్వలులై పారిపోయిన ప్రజలింకా తిరిగి రాలేదు.

జనరల్ లిన్ పో మకాం ఒక చిన్నఇంట్లో. లిన్ పో ఉన్నగదిలో ప్రవేశించాం. ఆగదిలో ఒక టేబులు, కొన్నికుర్చీలు, గోడలనిండా మ్యాపులు ఉన్నవి. మామూలు సైనికునిదుస్తులే నాల్గవపదాతి సైన్యాధిపతికూడా ధరించాడు!

కుమింగ్‌టాంగ్ సైన్యం పలాయనం చిత్తగిస్తున్నదనే వార్త ఆరోజు ఉదయమే వచ్చింది. పలాయనం చిత్తగిస్తున్న ఆసైన్యాన్ని ఎలా వెంటాడాలో వివరిస్తూ జనరల్ లిన్ పో ప్రజాసైన్యానికి ఉత్తర్వులు పంపటంలో నిమగ్నమైఉన్నాడు.

ప్రశాంతత లిన్ పో మొఖంలో ఉట్టిపడుతూ ఉంటుంది. కాని చురుకైన మనిషి. ఆయన గమనంలో తొట్రుపాటు కన్పించదు. కాని వేగం ఉంటుంది. ఒకరినొకరు పరామర్శించుకొన్న పిమ్మట అసలువిషయాలకు వచ్చాము. రెండు విషయాలనుగురించి విపులీకరించవలసిందని ఆయనను కోరాను. మొదటివిషయం, నాల్గవ పదాతి ప్రజాసైన్యం ప్రస్తుతం సాగిస్తున్న దండయాత్రనుగురించి.

యుద్ధరంగ పరిస్థితినిగురించి జనరల్ లిన్ పో వివరించసాగాడు. కుమింగ్‌టాంగ్ సైన్యాలు ప్రతిఘటించడం లేదని మొదట్లోనే అర్థమైంది. ప్రస్తుతం నాల్గవ పదాతిసైన్యం కుడి, ఎడమపార్శ్వాలనుంచి శత్రుశ్రేణులలోకి శరవేగంతో చొచ్చుకుపోతోంది. యూనాన్, వియత్‌నాయ్ సరిహద్దులమధ్య శత్రుబలాలను చక్రబంధం చేయాలనే వ్యూహంతో ప్రజాసైన్యం పురోగమిస్తోంది.

"చక్రబంధంనుంచి శత్రువు తప్పించుకుపోగలడా?" అని ప్రశ్నించాను.

"మా సైన్యం త్వరితగతిని పురోగమిస్తోంది. కుమింగ్‌టాంగ్ సైన్యాలు యూనాన్ సరిహద్దులు, దాటిపోలేవు. ఇక పోతే వియత్‌నామ్ సరిహద్దులు శత్రుసైన్యం దాటిపోగలిగేదీ లేనిదీ రెండుమూడురోజులలో తేలిపోతుంది. శత్రుబలాలు

వియత్ నామ్‌లో ప్రవేశించకుండా నిరోధించాలన్న సంకల్పంతో పురోగమిస్తున్నాము. చాంగ్ ముతా వియత్ నామ్‌లో ప్రవేశించేవిషయమై ఫ్రెంచివారితో మంతనాలు జరుపుతున్నారన్న విషయం మాకు తెలుసు. వియత్ నామ్‌లోకి చాంగ్ ముతా ప్రవేశించగల్గితే అక్కడి ప్రజోద్యమానికి తీరని ప్రమాదం ఏర్పడవచ్చు.

"మా చక్రబంధంలోగల శత్రుసైనికులసంఖ్య దాదాపు మూడులక్షలు. ఆ సైనిక బలాలకు జనరల్ పాయ్ సుంగ్ సి నాయకత్వం వహిస్తున్నాడు. అతనినిగూర్చి ఏమైనా తెలుసుకున్నారా?" అని కామ్రేడ్ లిన్ పో ప్రశ్నించాడు.

నేను పెకింగ్‌లో ఉండగానే పాయ్ సుంగ్ సిని గూర్చి కొన్ని విషయాలు తెలుసుకున్నాను. 1927 లో షాంఘై తిరుగుబాటును రక్తపు టేరుల్లో ముంచెత్తిన రక్తపిపాసి. అటు తర్వాత కుమింగ్‌టాంగ్ సైనికాధికారుల్లో ముఖ్యపదవి సంపాదించాడు. రెండు దశాబ్దాలనుంచి క్వాంగ్సి రాష్ట్రంలో నియంతగా వ్యవహరిస్తున్నాడు. ప్రస్తుతం దక్షిణచైనాలోగల కుమింగ్‌టాంగ్ సైనికబలాలకు సర్వసేనాని. పారిపోతున్న నాంకింగ్ - కాంటన్ - చుంకింగ్ - ఏదైనాకానీ - ప్రభుత్వంలో యుద్ధమంత్రి!

పాయ్ సుంగ్ సినిగురించి జనరల్ లిన్ పో ఇలావర్ణించాడు:

"కుమింగ్‌టాంగ్ సేనానులలోకల్లా పాయ్ సుంగ్ సి కడు సమర్థుడని నా ఉద్దేశం. అతనికి అనేక సంవత్సరాల పోరాటానుభవముంది. అయితే అతను ప్రజలపై కత్తి కట్టాడు. కుమింగ్‌టాంగ్ పార్టీ నానాటికి క్షీణించిపోతున్నది. కనుక యుద్ధరంగపరిస్థితి అతనికి ఎదురుతిరుగుతోంది.

"పోతే ఇక అతని రాజకీయజీవితం విషయం. వాగాడంబరుడు. క్వాంగ్సీరాష్ట్రంలో సర్వాధికారి. "ఇదిగో అమెరికా సహాయం", "అదిగో మూడో ప్రపంచయుద్ధం" అంటూ అబద్ధాలు ప్రచారం చేయటంద్వారా తన సైనికబలాల మనో నిబ్బరాన్ని కాపాడాలనుకొంటున్నాడు. అతని ఆస్తియావత్తూ క్వాంగ్సీరాష్ట్రంలో కేంద్రీకృతమై ఉంది. ఏది ఏమైనా జనరల్ పాయ సుంగ్ సి ఆటలు సాగేరోజులు అడుగంటాయి."

ఇదీ, యుద్ధరంగపరిస్థితులను గురించి జనరల్ లిన్ పో సంక్షిప్త అంచనా.

## 4

ఇక రెండవవిషయం, నాల్గవ పదాతి ప్రజాసైన్య పోరాటచరిత్ర.

"1949 మార్చి నెలలో ఈ సైన్యానికి ఈపేరు వచ్చింది. అంతకుపూర్వం మంచూరియన్ పదాతిసైన్యం, ఐక్యమంచూరియన్ ప్రజాస్వామిక సైన్యం అని పిలవబడుతూ ఉండేది. జపాను లొంగుబాటుకు పూర్వం ఈ సైనికదళాలు పాటుంగ్, ఉత్తర కియాంగ్సీ రాష్ట్రాలలో పోరాటం సాగిస్తూవుండేవి. జపాను పతనానంతరం మంచూరియావైపు పురోగమించాయి. కమ్యూనిస్టు సైన్యాలను హతమార్చటానికి చాంగ్ కై షేక్ పంపిన సైన్యాలను చీల్చి చెండాడి, మంచూరియాలో ప్రవేశించాయి.

"1945 లో చాంగ్ కై షేక్ మాపై పెద్దఎత్తున దండయాత్ర ప్రారంభించాడు. మా పరిస్థితి చాలా క్లిష్టంగావుంది. అందువల్ల తిరోగమించవలసివచ్చింది. అప్పట్లో మేము అనేక

ఇబ్బందులను ఎదుర్కోవలసి వచ్చింది. మేము ఎంతగా ప్రతి ఘటించినా శత్రువు ముందుకు చొచ్చుకువస్తున్నాడు. మావద్ద సరియైన ఆయుధాలులేవు. బలాధిక్యతలో శత్రువుదే పైచేయి. అందువల్ల మేము ఎత్తుగడలను మార్చకతప్పలేదు. పెద్దపెద్ద నగరాలను రక్షించుకోటానికి ప్రాకులాడకూడదన్న నిర్ణయానికి వచ్చాము. "మెరుపులా మెరిసి, ఉరుములా దెబ్బతీసే" యుద్ధాన్ని ప్రారంభించాము.

"మరొకప్రక్క మా యుద్ధశ్రేణుల వెనుక (రేర్) కుమింగ్‌టాంగ్ బందిపోట్లను హతమార్చటానికి కొన్ని సైనిక దళాలను పంపాం. ఆవిధంగా మా బేస్‌ను పదిలం చేసు కున్నాం. జపాను పతనానంతరం యుద్ధచర్యలు ఆపవలసిందని చాంగ్ కై షేక్ తన బలాలకు ఆదేశాలు పంపాడు. అయితే మంచూరియాలోని కుమింగ్‌టాంగ్ సైన్యాలను ఆ ఆదేశాన్ని వర్తింపచేయలేదు. మంచూరియాలో పరిస్థితి మాకు అంత అనుకూలంగాలేదు. మాపట్ల రైతులకు సానుభూతి ఉన్నా, భయంచేత వారు మొదట్లో మాకు సహాయపడేవారుకాదు.

"ఒకప్రక్క చాంగ్ కై షేక్ మాతో రాయబారాలు సాగిస్తూనే, మరొకప్రక్క మా బలాలపై యుద్ధాన్ని తీవ్రతరం చేయసాగాడు.

"1946_47 శీతాకాలంలో మా పరిస్థితి కొంతవరకు బాగుపడింది. శత్రుబలాల పరిస్థితి క్షీణదశలో పడసాగింది. చిన్నచిన్న స్థానిక విజయాలను సాధించసాగాము. మా సైనికుల మనోనిబ్బరం ఇనుమడించ సాగింది. మే మాసంనాటికి మంచూ రియాలో ఎదురుదెబ్బ తీయగలిగేస్థితికి చేరుకొన్నాము. రెండు

నెలలలో రెండు దండయాత్రలు సాగించి లక్షాయాభై శత్రు సైనికులను తుడిచిపెట్టాం.

"1948 సెప్టెంబరు మాసంలో జైత్రయాత్ర ప్రారంభించాము. చిన్ చౌను ముట్టడించి, దానిని హస్తగతం చేసుకోటంతో ఉత్తరచైనాలో గల శత్రుబలాలు ఉచ్చులో చిక్కుకొనిపోయాయి. ఒక్క చిన్‌చౌ పోరాటంలోనే కుమింగ్‌టాంగ్ లక్షమంది సైనికులను కోల్పోయింది.

"చాంగ్‌చున్ వద్ద 26 వేలమంది శత్రుసైనికులు తిరుగబడి, మా పక్షంలో చేరారు. మరొక 60 వేలమంది లొంగిపోయారు. చాంగ్‌చున్ రంగానికి చాంగ్ కై షేక్ స్వయంగా వచ్చి తన బలాలకు నాయకత్వం వహించాడు. ముక్డెన్ చుట్టుపట్ల గల తన బలాలను సమకూర్చుకొని చాంగ్‌చున్ రంగానికి బయలుదేరాడు. మార్గమధ్యంలోనే మేము వాటిని చుట్టుముట్టి తుడిచిపెట్టాము. అంతటితో ఆగక ముక్డెన్ నగరాన్ని ముట్టడించాము. 52 రోజులపాటు భీషణయుద్ధం జరిగినతరువాత మంచూరియా ముఖ్యపట్టణం మా హస్తగతమైంది. శత్రువు దాదాపు అయిదులక్షలమంది సైనికులను కోల్పోయాడు. మంచూరియాలో శత్రుశేషం లేకుండా చేయగల్గాము.

"వెనువెంటనే పెకింగ్, టీన్స్‌టిన్ నగరాలను ముట్టడించటానికి ముందుకు సాగాము. అప్పటికి మా సైనికులసంఖ్య పదిలక్షలకు పెరిగింది. మంచూరియాలో పార్టీ కార్యక్రమాన్నీ, పరిపాలనా బాధ్యతలనూ నిర్వహించటానికి మూడులక్షలమందిని ప్రత్యేకించాము. 1946 లో లక్షగా ఉన్న మా సైనికులు, మూడు సంవత్సరాలలో 15 లక్షలకు పెరిగారు.

"మా సైనిక బలాలు ఇంత త్వరితగతిని పెరగటానికి రెండు కారణాలుకలవు. భూసంస్కరణలు అమలు జరిపిన తర్వాత రైతుయువకులు ఉత్సాహంతో ప్రజాసైన్యంలో చేరసాగారు. బలవంతంగా కుమింగ్‌టాంగ్ సైన్యంలో చేర్చబడి, యుద్ధఖైదీలుగా చిక్కిన సైనికులు మా ఆశయాలను అర్థంచేసుకొని ప్రజాసైన్యంలో చేరారు.

"జనవరినెలలో టీన్‌స్టిన్‌పై ముట్టడించాము. పది కుమింగ్‌టాంగ్ సైన్యాలు ఆ నగరాన్ని రక్షిస్తున్నాయి. మా సైన్యాలు వాయవ్యదిశనుంచి ఒకటి, ఆగ్నేయదిశనుంచి మరొకటి ముట్టడి ప్రారంభించాయి. ఆ రెండుదిశలనుంచి బయలుదేరిన మా అగ్రగామిదళాలు నగరాన్ని రెండుగాచీల్చి సరిగా నగరం మధ్యలో కలుసుకున్నాయి. దానితో శత్రుకూటమిలో కంగారు బయలుదేరింది. 29 గంటల పోరాటం జరిగిన తర్వాత ఆ నగరం మా హస్తగతమైంది. పోతే, పెకింగ్‌లోగల కుమింగ్‌టాంగ్‌బలాలు ఒక్క తుపాకిగుండు పేల్చవలసిన అగత్యం లేకుండానే లొంగిపోయాయి.

"మార్చి,ఏప్రియల్ నెలలలో దక్షిణాభిముఖంగా పురోగమించి హ్యూపే రాజధాని హాంకౌపై నాల్గవ పదాతిసైన్యం దండెత్తింది. ఆగస్టు 5 వ తేదీన హ్యూనాన్ రాజధాని చాంగ్షాను హస్తగతం చేసుకుంది.

"ఇక ఇప్పుడు మేము మా చరమలక్ష్యాన్ని సాధించాలి. క్వాంగ్సీ రాష్ట్రాన్ని విముక్తంచేయాలి. ఆ రాష్ట్రంలోనే కుమింగ్‌టాంగ్ ప్రధానబలాలు కేంద్రీకృతమై ఉన్నవి. వాటిని హతమార్చాలి. మీ రడిగిన రెండు విషయాలను గురించి చెప్పటం పూర్తయింది."

"పరోక్ష-విషయం" అన్నాను.

"ఏమిటది ?"

"మిమ్మల్ని గురించి మూడుముక్కలు చెప్పండి."

అన్నట్టు మూడుముక్కలలోనే తన గాథను ముగించాడు కామ్రేడ్ లిన్ పో. 43 సంవత్సరాలక్రితం హ్యూపే రాష్ట్రంలో జన్మించాడు. 1924 లో ఉన్నత విద్యను పూర్తి చేసుకొని వాంపూ సైనికకళాశాలలో చేరాడు. 1925 లో కమ్యూనిస్టుపార్టీలో సభ్యుడుగా చేరాడు. 1927 లో చాంగ్ కై షేక్ విద్రోహం తర్వాత కుమింగ్‌టాంగ్‌తో తెగతెంపులు చేసుకొని నాన్ చాంగ్ తిరుగుబాటులో పాల్గొన్నాడు. తర్వాత ఘూటే సైనికదళంలో చేరి షాంటుంగ్, హ్యూనాన్ రాష్ట్రాలలో పోరాడాడు. అనుభవంద్వారా గెరిల్లాయుద్ధపద్ధతులను అలవర్చుకొన్నాడు.

1928 లో సింగ్ కాంగ్ షాన్ కొండల్లో మొదటిసారిగా మావో సే-టుంగ్‌తో పరిచయమైంది. అదేసంవత్సరంలో ఆ సైనికదళానికి నాయకుడయ్యాడు. 1934, 35 సంవత్సరాలలో 'లాంగ్ మార్చ్'లో పాల్గొన్నాడు. ఏనాన్ సైనిక కళాశాలా నిర్వహణ బాధ్యతను తీసుకున్నాడు.

1937లో 8 వ సైన్యంలో ప్రధానపాత్ర నిర్వహిస్తూ, జపానువ్యతిరేక యుద్ధంలో పాల్గొన్నాడు. తర్వాత రెండు సంవత్సరాలపాటు జబ్బుపడి, రష్యాలో చికిత్సపొందాడు. 1941 లో తిరిగి ఏనాన్ చేరుకొన్నాడు. 1942 లో కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ తరఫున చాంగ్ కై షేక్‌తో రాయబారాలు నడిపాడు.

1945 లో తిరిగి సైన్యాధిపత్యం స్వీకరించాడు. తన చరిత్రను చెప్పటం పూర్తి చేసి నేను ఏ సైనికదళాలను సందర్శించాలో వివరించాడు. ఆయనవద్ద సెలవుతీసుకున్నాను.

అరగంటలో నాగదికి చేరాను తన 25 సంవత్సరాల సైనికజీవితాన్ని గురించి లిన్ పో అయిదు నిముషాలలో చెప్పి ముగించాడు. కాని, 4 వ పదాతిసైన్య పోరాట చరిత్రను గురించి నాలుగుగంటలపాటు వివరించాడు. లిన్ పోనుగురించి లోగడ ఏదో విన్నగుర్తు. నా నోట్‌బుక్కు పేజీలు వెనక్కు తిరిగేశాను. కామ్రేడ్ యాంగ్ షి మింగ్ అనే రెజిమెంటల్ కమాండర్ చెప్పినవిషయం కన్పించింది.

"1933 లో కామ్రేడ్ లిన్ పో సైనికదళంలో పని చేశాను. ఆరోజుల్లో మేము నరకయాతనలు అనుభవిస్తూ ఉండే వాళ్ళం. ఎప్పటికప్పుడు మా పరిస్థితి ప్రమాదకరంగానే ఉంటూఉండేది. పరిస్థితి ఎంత ప్రమాదకరంగావున్నా కామ్రేడ్ లిన్ పో జంకూ గొంకూ లేకుండా ముందుండి నాయకత్వం వహించేవాడు. సైనికచర్య జరిగిన తరువాత ఏమన్నా లోపాలు జరిగితే ఆ లోపాలకుగల మూలకారణాలను వివరించి, తోటి కామ్రేడ్స్‌ను సరిదిద్దుతూ ఉండేవాడు. సైనికపరిస్థితిని చక్కగా అంచనా వేసేవాడు. గుండెనిబ్బరంతో వ్యవహరించేవాడు. అందువల్ల ఆయన అంటే సాధారణసైనికులకు పూర్తి విశ్వాసం ఉండేది."

కామ్రేడ్ లిన్ పోను గురించి ఎన్నివందల పేజీలైనా నింపవచ్చు. కాని, ఆయన జీవితాన్ని, ప్రజాసైన్య చరిత్రనుంచి విడదీయటానికి వీలులేదు. కమ్యూనిస్టుపార్టీ నాయకుడైన మావో సే-టుంగ్ శిక్షణక్రింద జనరల్ లిన్ పో నిగ్గుతేరాడు. సర్వస్వం విప్లవానికి అంకితం చేసిన నిస్వార్థజీవి.

# రెండో భాగం

## 1

రేపు 135 వ డివిజన్‌ను సందర్శించటానికి వెళ్లుతున్నాను. అది దక్షిణ హ్యూనాన్ పోరాటంలో మంచిపేరు సంపాదించు కొన్న డివిజన్. హెంగ్‌యాంగ్‌పట్టణ మేయరు అయిన కామ్రేడ్ మావ్ యువాన్ యావోతో మాట్లాడుతూ చాలసేపు గడిపాను.

కొత్తగా విముక్తమైన పట్టణానికి మేయర్ అయిన కామ్రేడ్ మావ్ యువాన్ యావోకు తలమునకలుగా పనులుంటాయని నాకు తెలుసు. అయినా ఆయన జీవితగాథను వింటూంటే వివరాలు తెలుసుకోవాలనిపించింది. విప్లవమే వృత్తిగాగల అనేక వేలమంది చైనీయుల జీవితాలకు ఆయన జీవితం ఒక చిహ్నం.

టీ కప్పు బల్లపై ఉంది. అప్పుడప్పుడూ టీ చప్పరిస్తూ కామ్రేడ్ మావ్ తన చరిత్రను చెప్పసాగాడు.

వయస్సు37 సంవత్సరాలు. కామ్రేడ్ మావో సే-టుంగ్ జన్మించిన ప్రాంతంలోనే ఆయనకూడా జన్మించాడు.

1925-27 సంవత్సరాలలో చైనా విప్లవంనాటికి ఆయన వయస్సు13సంవత్సరాలు. ఆనాటివిషయాలు ఆయనకు స్పష్టంగా

గుర్తున్నాయి. వాళ్ళవూళ్ళో ప్రజాసంఘాలు పనిచేస్తూఉండేవి. 1925 లో బాలసంఘంలో చేరాడు. ఇతర బాలురతోపాటు పెద్దలకు సహాయపడుతుండేవాడు.

నల్లమందు పీల్చేవాళ్ళనుగురించీ, జూదగాళ్ళనుగురించీ, రైతు సంఘాలకు రిపోర్టుచేసే బాధ్యత బాలురకు అప్పజెప్పారు. నల్లమందుభాయీలను, జూదగాళ్ళను, త్రాగుబోతులను బజార్లలో పట్టుకొని బాలసంఘాలకు చెందిన పిల్లలు ఏడ్పించేవారు. అది ఆకతాయితనంగా భావించటానికి వీలులేదు. భూస్వాములు పనికట్టుకొని, ఆ దురలవాట్లను రైతులకు నేర్పేవారు. వాటిని రైతు సంఘాలు ఎదుర్కోవలసి వచ్చింది.

1926 లో యువక కమ్యూనిస్టు సమితిలో చేరాడు. రాజకీయాలు అంతగా తెలియకపోయినా ఒక విషయం మాత్రం గట్టిగా తెలుసుకున్నాడు. భూస్వాములు పోవాలంటే కమ్యూనిస్టులను సహాయపడాలని. యువక కమ్యూనిస్టు సమితిలో ఆయన చేరటానికి అదే ఏకైక కారణం.

అది తల్లిదండ్రులకు ఇష్టం లేకపోయినా అభ్యంతరం మాత్రంచెప్పలేదు. పదిహేనోయేట యువక కమ్యూనిస్టుసమితి కార్యదర్శిగా ఎన్నుకోబడ్డాడు. లెనిన్ ఫొటోను ఆఫీసు గోడకు అంటించారు. ప్రతిసభ్యుడు ఆ ఫొటోముందు నిలబడి 'విప్లవానికి ఎప్పుడూ ద్రోహంచేయను' అని ప్రతిజ్ఞచేస్తూఉండేవారు.

1927 లో విప్లవం విఫలమైంది. పరిస్థితులు విషమించాయి. యువక కమ్యూనిస్టుసమితి సభ్యులుకూడా రహస్య జీవితం గడపవలసివచ్చింది. కొండల్లో తిండితిప్పలు లేకుండా కొన్నిరోజులు గడిపాడు.

1929లో మావో సే-టుంగ్ సోదరుడు మావో సే-మింగ్ పిలుపు నందుకొని ఆయన టీన్ట్సిన్ నగరానికి వెళ్ళాడు. పార్టీ తరఫున టీన్ట్సిన్‌లో రహస్యంగా ప్రింటింగు ప్రెస్ పెట్టారు. ఆ ప్రెస్‌లో పనిచేయటానికి ఆయనను పిలిపించారు. అక్కడే పార్టీలో చేరాడు. పార్టీ ప్రెస్ పగలు మామూలుగానే పనిచేసేది. శుభలేఖలు, నోటీసులు తదితర అచ్చు పనులు చేసేవారు.

చైనాలో అలాంటి ప్రెస్సులు చాలా ఉండేవి. అందువల్ల పార్టీ ప్రెస్సులపై ఎవరికీ అనుమానం పుట్టలేదు.

"ముప్పయిమంది కంపోజిటర్లలో నేనొకడిని. పగలు మామూలు పనులు ముగించుకొని, రాత్రిపూట కమ్యూనిస్టు పత్రిక 'రెడ్ ఫ్లాగ్' అచ్చువేస్తూ ఉండేవాళ్ళం. పార్టీ కేంద్ర కమిటీ ఆధ్వర్యంలో ఆ పత్రిక నడిచేది.

"ఆ పత్రికకు వ్యాసాలు ఎవరెవరు వ్రాస్తుండేవారో, ఆ పత్రికను ఎలా పంచుతుండేవారో మాకు తెలియదు. సాయంకాలానికి వ్యాసాలు, న్యూస్ ప్రింటు వచ్చేవి. తెల్లవారే టప్పటికి పత్రికలు బయటకు వెళ్ళేవి.

"ఈ విధంగా 1931 వరకు టీన్ట్సిన్‌లో పనిచేసాను. షాంఘైలో మరొక ప్రెస్సు ఏర్పాటు చేస్తున్నారని నన్ను అక్కడికి బదిలీచేశారు. షాంఘైలో ఏర్పాటుచేసిన ప్రెస్ పూర్తిగా రహస్యప్రెస్.

"నేను ధనవంతుని కొడుకులా వ్యవహరించాను. పెద్ద బంగళా అద్దెకు తీసుకున్నాము. ఆ బంగళా ముందుగదులు పెద్ద వ్యాపారి నివసించేవిగా కనిపించేవి. ఇంటి యజమాని

(నేను), అందమైన యజమాని భార్య (మా యూనిట్‌లో ఒక యువతి ఆ పాత్రను నిర్వహించింది), పిల్లలు, నర్సులు, తోట మాలి, కాపలావాడు, వంటవాడు, ఒక బోయ్-ఇలా ఎనిమిది మంది ఆ ఇంట్లో చేరాం.

"పగలు వ్యాపారిని. రాత్రి ప్రెస్‌వర్కరుని. మా ప్రెస్‌లో గ్రంథాలు, కరపత్రాలు, పత్రికలు అచ్చువేసేవాళ్ళం. మా ఇంటిపక్కనే రేయింబవళ్ళు ఆడే ఫ్యాక్టరీ ఒకటి ఉండటంతో మా పని తేలిక అయింది.

"నాలుగు సంవత్సరాలపాటు అక్కడ పనిచేసాను. దృష్టిలోపం అప్పుడే ప్రాప్తించింది. పని చాలా అధికంగా ఉండేది. అనేక మార్క్సిస్టు గ్రంథాలను మేము అచ్చువేశాము. షాంఘై పార్టీ వార్తాపత్రిక "విక్టరీ" అచ్చు వేస్తుండేవాళ్ళం.

"1934 లో షాంఘై రహస్యపార్టీ యంత్రంపై కుమింగ్ టాంగ్ దెబ్బతీసింది. ఆ దెబ్బతో మాకూ, రహస్యపార్టీకీ గల సంబంధాలు తెగిపోయాయి; డబ్బురావటం ఆగిపోయింది. ఇక విధిలేక ప్రెస్సు మూసివేసాము. ఆరోజుల్లో నాతో పని చేసిన కామ్రేడ్స్ ఇప్పుడు పార్టీలో ప్రధాన బాధ్యతలు నిర్వహిస్తున్నారు.

"మొదట షాంఘై పరిసర ప్రాంతాలలోను, తర్వాత నా స్వరాష్ట్రంలోను ఉపాధ్యాయవృత్తి సాగిస్తూ రైతుఉద్యమ నిర్మాణంలో పాల్గొన్నాను. పగలుపూట పిల్లలకు, రాత్రిపూట పెద్దలకు చదువు చెప్పుతుండేవాణ్ణి. రాత్రి పాఠశాలకు హాజరయ్యే రైతులతో విడివిడిగా సన్నిహిత సంబంధాలు పెట్టుకొని, క్రమేణా వారికి రాజకీయాలు బోధిస్తుండేవాణ్ణి. విప్లవకర

సాహిత్యం కలిగిఉండటమే. ఆ రోజుల్లో మహాప్రమాదకరం. శత్రువు చేతుల్లోపడి పాంఘైకమిటీపూర్తిగానాశనమైపోయింది. రెడ్డార్మీ 'లాంగ్ మార్చి' ప్రారంభించి, దూరప్రాంతానికి తరలి పోయింది. పార్టీతో సంబంధం పెట్టుకోవటం కష్టతరమైంది.

1937 లో హ్యూనాన్ రాష్ట్రానికి కేంద్రకమిటీ ఒక ఆర్గనైజరును పంపింది. నేను పనిచేసే ప్రాంతంలో పార్టీ విష యాలను ఆ ఆర్గనైజరుకు అప్పజెప్పి, ఉత్తర షెన్సీ రాష్ట్రానికి వెళ్ళిపోయాను. విముక్త ప్రాంతంలో ప్రవేశించిన పిమ్మట యేనాన్‌లోని 'జపాను వ్యతిరేక విశ్వవిద్యాలయం'లో మూడు మాసాలు అభ్యసించాను. తరువాత కొంతకాలంపాటు 8 వ సైన్యం రాజకీయశాఖలో ప్రచురణాలయ బాధ్యతను నిర్వ హించాను.

1945 లో మళ్ళీ పార్టీ స్కూలులో ప్రవేశించాను. కాని, జపాను వ్యతిరేక గెరిల్లా పోరాటం కొనసాగించటానికి పార్టీ నన్ను హ్యూనాన్ రాష్ట్రానికి పంపింది. జపాను లొంగు బాటు అనంతరం రహస్యంగా మంచూరియాకు చేరుకున్నాను. హ్యూనాన్ రాష్ట్రంపై 4వ పదాతి సైన్యం దండయాత్ర జరపబోతున్నందున, ఆసేనతో ఈ రాష్ట్రానికి వచ్చాను.

"హెంగ్‌యాంగ్ పట్టణం ప్రజాసేన హస్తగతం కావ టానికి కొద్ది రోజులముందు నా స్వగ్రామం దర్శించే భాగ్యం లభించింది. మాఫూళ్లో 24 గంటలపాటు గడిపి, తిరిగి పురోగ మించే ప్రజాసైన్యం వెంట బయలుదేరాను."

నేను అనేకమంది చైనా కమ్యూనిస్టులను కలుసు కున్నాను. కాని వారెవరుకూడా వాళ్ల ఇంటిగొడవలే ప్రస్తావించే

వారుకాదు. అలాగే కామ్రేడ్ మావ్ కూడా. విప్లవ పోరాటానికి సంబంధించినంత వరకే వారు ప్రస్తావిస్తారు. అంతే.

కుతూహలం పట్టలేక ఒక చిన్న ప్రశ్న వేశాను.

"చాలాకాలం తర్వాత మీఇంటికి వెళ్లారుగదా! ఆ పునస్సమాగమం ఎలా ఉంది?"

కామ్రేడ్ మావ్ కొద్ది క్షణాలపాటు మౌనం వహించాడు; ఆయన మొఖంలో చిరునవ్వు మెరిసింది.

"ఇంటికి చేరుకొనే సరికి అర్ధరాత్రి అయింది. అంతా నిద్రపోతున్నారు. తలుపు తట్టాను. మా నాన్న వచ్చి తలుపు తీశాడు. అమ్మమ్మగారింటి దగ్గరఉన్న మాతల్లిని తీసుకురావటానికి ఒకరు వెళ్లారు. ఎట్టకేలకు విప్లవం జయప్రదమవుతున్నందుకు వారుపొందిన ఆనందానికి మేరలేదు. ఆ పగలల్లా మా వూళ్లోనే గడచిపోయింది. పొద్దుకూకింది. ప్రజాసైన్యం హెంగ్‌యాంగ్ శివార్లలో ప్రవేశిస్తోంది. వ్యవధిలేక వెంటనే బయలుదేరి వచ్చి ప్రజా సైన్యాన్ని కలుసుకున్నాను."

తరువాత హెంగ్‌యాంగ్ పట్టణ మేయర్‌గా పొందిన అనుభవాలను కామ్రేడ్ మావ్ ఇలా వివరించాడు:

"పట్టణంలోగల విద్యుత్ కేంద్రాన్ని, తదితర యంత్రాగారాలను సర్వనాశనం చేయాలని పట్టణంనుంచి పారిపోయే ముందు కుమింగ్‌టాంగ్ అధికారులు ఉత్తర్వు చేసారు. ఆ ఉత్తర్వు మేరకు ఒక సైనికాధికారిని నియమించారు. కాని, రహస్యంగా పట్టణంలో పనిచేస్తున్న పార్టీ కార్యకర్తలు తెలివితేటలు ప్రదర్శించి విద్యుత్ కేంద్రాన్ని, తదితర యంత్రాగారాలను రక్షించారు.

ఎలా సాధ్యపడిందని ప్రశ్నించాను.

"కుమింగ్‌టాంగ్ సైనికాధికారికి అయిదువందల డాలర్లు పార్టీ కార్యకర్తలు ముట్టజెప్పారు. ఎందుకూ పనికిరాని ఏదో భవనాన్ని మందుగుండుతో పేల్చారు. విద్యుత్ కేంద్రాన్ని సర్వనాశనం చేసివచ్చామని పై అధికారులకు తెలియజేశారు. అనుకొన్న టైముకు విద్యుత్ దీపాలు ఆరిపోయాయి. అయినా పార్టీ కార్యకర్తలు అంతటితో సంతృప్తిచెంది ఊరుకోలేదు. ఒకవేళ అసలుసంగతి బయటపడి, మళ్ళీ కుమింగ్‌టాంగ్ సైనికులు వస్తారేమోనని విద్యుత్ కేంద్రాన్ని రక్షించటంకోసం అన్ని ఏర్పాట్లు చేసారు. మరుసటిరోజు ఉదయాన శత్రు సైనికులు వచ్చి, అక్కడ రక్షణ కట్టుబాట్లు చూసి భయపడి పోయారు. ఆ సమయానికి ప్రజాసైన్యం కూడా పట్టణ శివార్ల లోనికి చేరుకొంది.

"పట్టణం ప్రజాసైన్యం హస్తగతంకావటంతోనే, పట్టణ పరిపాలన బాధ్యతను సైనిక విప్లవకమిటీ స్వీకరించింది. ఆ కమిటీ అంతకు పూర్వమే సమావేశమై ప్లానులు, కార్యక్రమం తయారుచేసింది.

"ప్రజోపకర పరిశ్రమల నన్నింటినీ స్వాధీనం చేసుకున్నాము. ఆ పరిశ్రమలలో పనిచేసే ఉద్యోగులంతా వెంటనే వచ్చి తమ తమ బాధ్యతలను స్వీకరించారు. అందువల్ల పరిపాలనా కార్యక్రమం నిర్విఘ్నంగా కొనసాగింది.

"ప్రభుత్వ యాజమాన్యానగల పరిశ్రమల నన్నింటినీ స్వాధీనంచేసుకొన్నాం. ఆ విషయంలో కార్మికులు మాకు పూర్తిగా తోడ్పడ్డారు. అందువల్ల ఏ ఒక్క సామాను బీరు పోకుండా స్వాధీనం చేసుకోగలిగాం.

"సైనిక విప్లవకమిటీ కార్యాలయాన్ని లోగడ ట్రాన్ పోర్టు బ్యాంకిశాఖకు చెందిన భవనంలో స్థాపించాము. పేరుకు ఆ ట్రాన్సుపోర్టు బ్యాంకు ప్రభుత్వ పరమైనదని చెప్పినా, నిజానికి అది నాలుగు కుటుంబాల - చాంగ్ కై షేక్, కుంగ్ సియాంగ్‌సి, సుంగ్ సే వెన్, చెన్ సోదరుల కుటుంబాల - స్వంతబ్యాంకి. చైనాప్రజానీకాన్ని అనేక సంవత్సరాలుగా ఆ నాలుగు కుటుంబాలు నిలువుదోపిడీ చేసాయి.

"ప్రజాసంస్థల ప్రతినిధులతో సంప్రతించి, మ్యునిసిపల్ కౌన్సిల్‌ను ఏర్పరచాం. ఆ కౌన్సిల్ ప్రధమకర్తవ్యంగా పట్ట ణాన్ని పరిశుభ్రం చేసింది. తరువాత పట్టణంలో పాఠశాలల సంఖ్యనుపెంచి, అవి సక్రమంగా నడవటానికి కావలసిన చర్య లను తీసుకున్నాము. ఈ సందర్భంలో ఒక విషయం విధిగా చెప్పాలి. విద్యావ్యాప్తి విషయంలో సోవియెట్ రష్యా అను భవాలను మేము స్వీకరించాం."

"ప్రజాప్రభుత్వ కార్యవిధానాలను కొందరైనా ప్రతి ఘటించలేదా?" అని ప్రశ్నించాను.

"ప్రతిఘటించారు. ఆ ప్రతిఘటన రెండు రూపాలలో బయటపడింది. ప్రజాప్రభుత్వం జారీచేసిన కొత్త కరెన్సీకి వ్యతి రేకంగా శత్రువర్గాలు ప్రచారం చేశాయి; మరొకప్రక్క ఆ వర్గాలే వస్తువుల ధరలు విపరీతంగా పెరగటానికి దోహద మిచ్చాయి.

"ఆర్థిక రంగానికి సంబంధించినంతవరకు అలాచేశారు. పోతే, కొందరురాజకీయగూఢచారులనుకూడా పాయ్ సుంగ్ సి ముఠా ఇక్కడ నియమించిపోయింది. ఆ గూఢచారులుఅబద్ధా లను ప్రచారంచేస్తూ, ప్రజలను భయపెట్టాలని చూస్తున్నారు. కాని వారి ఆటలు సాగవు"అని కామ్రేడ్ మావ్ ముగించాడు.

# మూడో భాగం

## ఇద్దరు సైనికులు

### 1

ప్రజావిముక్తి సైన్యంలో ప్రధానంగా రెండు తరహాల సైనికులున్నారు. వ్యవసాయ సంస్కరణలవల్ల భూమి లభించిన కుటుంబాలకు చెందిన రైతుయువకులు ఒక తరహా. లోగడ కుమింగ్‌టాంగ్ సైనికులుగా ఉండి, తరువాత ప్రజాసైన్యంలోకి ఇష్టపూర్వకంగా వచ్చి చేరినవారు రెండవతరహా.

ఇప్పుడు ఇద్దరు ప్రజాసైనికులనుగురించి ఇక్కడ ప్రస్తావిస్తాను. ఆ రెండు తరహాల సైనికులకూ వీరిద్దరూ ప్రతిమూర్తులు.

క్వీలిన్ నగరంలో కామ్రేడ్ ఫూ ఫెంగ్-గాన్‌ను కలుసుకున్నాను. పొట్టిగా, బొద్దుగా, గుండ్రని మొఖం గలిగిన పల్లెటూరి రైతుబిడ్డ. వయస్సు పందొమ్మిది సంవత్సరాలు. అయితే అంతకన్నా కాస్త వయస్సు ముదిరినవాడుగా కన్పిస్తాడు. తన జీవితగాథను ఫూ ఫెంగ్-గాన్ ఇలాచెప్పాడు :

మంచూరియాలోని ఆన్‌టుంగ్ రాష్ట్రంలో జన్మించాడు. తల్లిదండ్రులు కటికి దరిద్రులు. తల్లీ, తండ్రీకూడా పొలం మీద పనిపాటలు చేసుకుంటూ జీవించేవాళ్లు. తను చిన్నవాడైనప్పటికీ భూస్వామి గొడ్లను కాచేవాడు.

1946 లో ఫూ ఫెంగ్-గాన్ నివసించే ప్రాంతంలో భూసంస్కరణలను అమలు జరిపారు. ఇతరులతోపాటు ఫూ ఫెంగ్-గాన్ కుటుంబానికీ భూమి లభించింది. అప్పటికి ఫూ ఫెంగ్-గాన్ వయస్సు16సంవత్సరాలు. ఫూ ఫెంగ్-గాన్‌తో వాళ్ళనాన్న అన్నాడు :

"పెద్దకొడుకువి పోయి ప్రజాసైన్యంలో చేరు. మనకు వచ్చిన పొలాన్ని మనమే రక్షించుకోవాలి."

ఫూ ఫెంగ్-గాన్ ప్రాంతీయ ప్రజా సైన్యంలో చేరాడు. కుమింగ్‌టాంగ్ బలగం ఆన్‌టుంగ్ ప్రాంతాన్ని వశపర్చుకొంది. రైతులకు పంచిన భూములను కుమింగ్‌టాంగ్‌ముఠా తిరిగి భూస్వాములకు కట్టబెట్టింది. కుమింగ్‌టాంగ్ సైనికులు రైతుల ఆస్తిపాస్తులను కొల్లగొట్టారు.

ప్రజాసైన్యం కుమింగ్‌టాంగ్ బలాలను తరిమికొట్టింది. ఒకసారి ఇంటికి వెళ్ళివస్తానని ఫూ ఫెంగ్-గాన్ సెలవు తీసుకున్నాడు. ఇంటికివచ్చి చూసుకుంటే అంతా సర్వనాశనమైంది. అప్పుడే కుమింగ్‌టాంగ్ ముఠాపై నాగుబాములా పగపూనాడు. తన కుటుంబంపై సాగించిన దౌర్జన్యకాండకు కసి తీర్చుకోవాలని సంకల్పించాడు.

వెంటనే ప్రజా సైనికాధికారుల దగ్గరకు వెళ్ళాడు. తననుకూడా రెగ్యులరు సైన్యంలో చేర్చుకోమన్నాడు. కాని, ఫూ ఫెంగ్-గాన్ వయస్సు పదిహేడు సంవత్సరాలు. కాన చేర్చుకోటానికి వీలులేదన్నారు ఆ సైనికాధికారులు. అయినా పోట్లాడి మరీ రెగ్యులర్ సైన్యంలో చేరాడు.

ప్రజాసైన్యం చిన్‌చౌనగరాన్ని ముట్టడిస్తోంది. ఆ ముట్టడిలో ఫూ ఫెంగ్-గాన్‌కూడా పాల్గొంటున్నాడు. ఎలా

గైనా చిన్‌చౌ నగరాన్ని హస్తగతంచేసుకోవాలనీ, ఆ నగరం వశమైతే, యావత్తు మంచూరియా విముక్తమై తీరుతుందనీ ప్రజా సైన్యాధిపతి వివరించాడు.

ఫూ ఫెంగ్-గాన్ విన్నాడు. ఆలోచించాడు. కుమింగ్‌టాంగ్ ముఠావల్ల తన కుటుంబానికి కలిగిన విపత్తు స్ఫురణకు వచ్చింది. అందరికన్నా ముందుగా ఫూ ఫెంగ్-గాన్ ఈ క్రింది ప్రతిజ్ఞ తీసుకున్నాడు:

(1) స్వల్పమైన గాయాలు తగిలినా పోరాటం విరమించను. పెద్ద పెద్ద గాయాలు తగిలితే పెడబొబ్బలు పెట్టను. (2) ఆహారపదార్థాల కొరతఏర్పడితే, ముందు ఇతరసైనికులు తిండితిన్నతర్వాతనే నేను తింటాను. (3) నాకిచ్చిన బాధ్యతలను నెరవేర్చటంలో ప్రాణాన్ని బలిపెట్టటానికిసైతం వెను దీయను. తోటి కామ్రేడ్ గాయపడితే సురక్షిత ప్రాంతానికి చేర్చుతాను. (4) ముందంజ వేయటంలో మొదటివాడుగానూ, పారిపోవటంలో చివరివాడుగానూ ఉంటాను.

పై ప్రతిజ్ఞాపత్రంపై ఫూ ఫెంగ్-గాన్ వేలిముద్రవేశాడు. ఫూ ఫెంగ్-గాన్ సైనికదళం పోరాడేప్రాంతం చిన్‌చౌ శివార్లలోని ఒక పల్లెటూరు. పేరు తాషాన్. ఆ రాత్రి ఒక రక్షణ శ్రేణిని వారు నిర్మించుకొన్నారు.

మరుసటిరోజు ఉదయానే తాషాన్ పోరాటం ప్రారంభమైంది; వారంరోజులపాటు ఆ పోరాటం జరిగింది. ప్రజా సైన్యంపై శత్రువిమానాలు మొదటిరోజునే అగ్నివర్షం గురిపించాయి. మొదటిరోజు యుద్ధంలో ప్రజాసైనికదళం శత్రు దాడులను తిప్పికొట్టింది. కాని, రెండవ రోజున శత్రుబలాలు

ప్రజాసైనికుల రక్షణశ్రేణులను చీల్చుకొని ముందుకు రాగలిగారు. ఫూ ఫెంగ్-గాన్ దళనాయకుడు చనిపోయాడు.

"నాయకత్వ బాధ్యతను నేను స్వీకరిస్తాను" అంటూ ఫూ ఫెంగ్-గాన్ ముందుకు ఉరికాడు.

ఫూ ఫెంగ్-గాన్ నాయకత్వాన ప్రజాసైనికులు సురక్షిత ప్రాంతానికి తిరోగమించి, అక్కడ కాలూని పోరాడసాగారు. ప్రజాసైనికదళంలో మిగిలింది ముగ్గురే ముగ్గురు సైనికులు. మిగతా వారంతా నేలకొరిగారు. ఆ ముగ్గురు సైనికులు ఆ పగలంతా శత్రుసైనికులను ముందుకు రానీయకుండా నిరోధించగలిగారు.

ఆరాత్రి ఆముగ్గురు సైనికులు తిండి ముట్టలేదు. వారికి నిద్ర పట్టలేదు. ఫూ ఫెంగ్-గాన్ మిగతా ఇద్దరి సైనికులను ఇలా హెచ్చరించాడు:

"ఇరవై మందికి ముగ్గురంమిగిలాం. ముగ్గురం కలసి కట్టుగా ఉందాం. కలసికట్టుగా జీవిద్దాం. అవసరమైతే కలసి కట్టుగానే మరణిద్దాం."

ఆ ముగ్గురు సైనికులు ఆరక్షణశ్రేణిని నాలుగు రోజుల పాటు రక్షించారు.

ఏడోరోజున ఫూ ఫెంగ్-గాన్ రక్షణశ్రేణికి ఎదురుగా ఒక సంఘటన జరిగింది. ఆక్రితం రాత్రి రెండు కుమింగ్‌టాంగ్ సైనికదళాలు దొంగచాటుగా ముందుకురాగలిగాయి. చాలా ప్రమాదకర పరిస్థితులు ఏర్పడ్డాయి.

ఫూ ఫెంగ్-గాన్ నిశ్చయించాడు. కందకంనుంచి బయటకు వచ్చాడు. కుమింగ్‌టాంగ్ మరతుపాకులు ఉన్నవైపు

పాక్కుంటూ వెళ్లుతున్నాడు. అంతకుముందే అలా పాక్కుంటూ వెళ్లిన ముగ్గురు ప్రజా సైనికులు నేలకొరిగారు. నెమ్మదిగా కుమింగ్‌టాంగ్ సైనికులను వెనకగా వెళ్ళి, ఒకడిని కాల్చి చంపాడు. మరిద్దరు సైనికులు భయపడి లొంగిపోయారు. ఆఖైదీలిద్దరుచేత మరతుపాకులు చేతపట్టించి, తనకు ముందు నేలకొరిగిన కామ్రేడ్స్ దగ్గరకు వెళ్లాడు. వారు అప్పటికే విగత జీవులయ్యారు. మరతుపాకులను, యుద్ధఖైదీలను తమ రక్షణ శ్రేణులకు పట్టుకొచ్చాడు ఫూ ఫెంగ్-గాన్. అలాగే ఇంకొకసారి శత్రుశ్రేణుల మధ్యకువెళ్లి పదిమంది ఖైదీలను, మరిరెండు మర తుపాకులను సంపాదించుకువచ్చాడు.

వారంరోజులకుమునుపు ఫూ ఫెంగ్-గాన్ ఒకమామూలు రైతు యువకుడు. వారం రోజుల అనంతరం ఆరితేరిన సైనికుడు!

ఫూ ఫెంగ్-గాన్ ప్రదర్శించిన ధైర్యసాహసాలకు, నేర్పరితనానికి "ఆర్డర్ ఆఫ్ మావో సే-టుంగ్" బిరుదప్రదానం చేశారు. ఆబిరుదును స్వీకరిస్తూ ఫూ ఫెంగ్-గాన్ అన్న మాటలు ఏమిటో తెలుసా?

"ఆర్డర్ ఆఫ్ మావో సే-టుంగ్" బిరుదు నాకిస్తున్నారు. సరిదిద్దుకోవలసిన తప్పులు నాలో చాలా ఉన్నవి. ఇక ముందు ఇంకా బాగా పోరాడతాను. పొరపాట్లు దొర్లకుండా జాగ్రత్త పడతాను."

ఆ మరుసటిరోజు ప్రజాసైన్యం పెకింగ్‌పై ముట్టడి జరప బోతున్నది. ఫూ ఫెంగ్-గాన్ గాయాలతో బాధపడుతున్నాడు. అయినా ఆసుపత్రిలో చేరక ఒక బండిలో ఎక్కి, ప్రజాసైనిక వాహిని జైత్రయాత్రలో పెకింగ్‌వైపు వెళ్లుతున్నాడు.

ఇదీ కామ్రేడ్ ఫూ ఫెంగ్-గాన్ సంక్షిప్త చరిత్ర.

## 2

అది 1948 సంవత్సరం. చిన్‌చౌ శివార్లలో కామ్రేడ్ ఫూ ఫెంగ్ - గాన్ వీరాభిమన్యుడై పోరాడుతున్న సమయం లోనే, మరొక సైనికుని జీవితంలో ముఖ్యఘటన జరిగింది. చిన్‌చౌ నగరంలోనే ఆ ఘటన జరిగింది. ఆ సైనికునిపేరు కామ్రేడ్ చాన్ చే-యూ. ఆ ఘటనతో చాన్ చే - యూ భవిష్యత్తంతా మరొకరూపం పొందింది. అతను ప్రజాసైన్యా నికి లొంగి పోయాడు.

కామ్రేడ్ చాన్ చే-యూ చెప్పిన గాథను దాదాపు యథాతథంగా ఇక్కడ పొందుపర్చుతున్నాను.

"క్వాంటుంగ్ రాష్ట్రంలో నిరుపేద కుటుంబంలో పుట్టాను. తండ్రీ, తల్లీ, ముగ్గురు సోదరులూ, ఒక సోదరీ, ఒక మేనల్లుడూ - వీరందరికీగాను మాకున్న ఆస్తి రెండు కుంటలు. 14 వ ఏటనే సిగరెట్టు ఫ్యాక్టరీలో చేరాను. కొద్ది రోజులకే తండ్రిచనిపోయాడు. దహనసంస్కారానికి కూడా మా వద్ద డబ్బులేదు. అందుకోసం అప్పుజేసాం. అప్పుతీర్చలేక పోయాం. ఉన్నకాస్త కొంచెం అప్పుక్రింద భూస్వామికి దఖలు పడిపోయింది.

"ఉన్నఊళ్లో గడవక పట్నంవెళ్ళి పొగాకు ఫ్యాక్టరీలో చేరాను. అడవచాకిరీ చేయించుకొనేవాడు మా యజమాని. కాని, పొట్టనిండా కూడు కూడా పెట్టేవాడుకాదు. ఆ బాధలు పడలేక తిరిగి స్వగ్రామానికే చేరుకొన్నాను.

"మా అమ్మ అడుక్కొంటూ జీవిస్తోంది. తల్లిని పోషించ లేని అసమర్థుడిని కావటంవల్ల ఊళ్లో తలెత్తుకొని తిరగలేక

పోయాను. మా అమ్మ వద్దని వారిస్తున్నా ఇల్లువిడిచి వెళ్ళి పోయాను.

"కొంతమంది బాటసారులతోపాటు ఫుకీన్ చేరు కొన్నాను. ఫుకీన్ రాష్ట్రంలోని పిన్ హూ పట్టణంలో రెండు సంవత్సరాలు కల్లుదుకాణంలో నౌకరుగా జీవించాను.

"రెండు సంవత్సరాల అనంతరం ఎవరో నాదగ్గరకు వచ్చారు. క్వాంటుంగ్ రాష్ట్రంనుంచి వచ్చావుగదా? నీ రాకకు సంబంధించిన కాగితాలు చూపించమని అడిగాడు. అలాంటి కాగితాలు నావద్ద లేవన్నాను. అయితే సైన్యంలో చేరితీరా లన్నాడు.

"ఆ విధంగా కుమింగ్‌టాంగ్ సైన్యంలో చేరాను. నేను చిన్నప్పుడు స్కూల్లో చదువుకొన్నాను. సైన్యంలో చేరిన సంగతిని ఉత్తరంముఖ్యద్వారా అమ్మకి తెలియజేసాను. అంత వృద్ధాప్యంలోకూడా నన్ను చూడటానికి కొన్ని వందల మైళ్ళు నడిచివచ్చింది. సైన్యంలో చేరవద్దని ఎంతగానో చెప్పింది. చేరటం చేరకపోవటం నాచేతిలో లేదని చెప్పాను. పిన్ హూ పట్టణంలోనే అడుక్కుంటూ అమ్మ జీవించనాగింది.

"ఒటచోటనుంచి మరొక ప్రాంతానికి మార్చేటప్పుడు మాచేతులకు సంకెళ్ళు తగిలించేవారు. ఎవరైనా తప్పించుకు పారిపోతే, మా వీపులు పగిలిపోయేవి.

ఇక తిండివిషయం చాలా దారుణంగా ఉండేది. మా రేషన్‌లలో సగం కమాండరు దిగమింగేవాడు. దారిలోనే మాలో చాలామంది జబ్బులకు, ఆకలికి తాళలేక చచ్చిపోయారు.

"మా చేతులకు తగిలించిన బేడీలు ఊడదీశారు. మరు-క్షణంలో మేము సైనికులంగా మారిపోయాము. అంతవరదాకా అధికారులు మమ్మల్ని దోపిడీచేశారు. ఆ తర్వాత మేము ప్రజలను కొల్లగొట్టసాగాం. ఇలా 'తర్ఫీదు' పొందిన తరువాత జనరలిజ్మో చాంగ్ కై షేక్‌మాకు ఉత్తర్వులు పంపాడు.

"దేశభక్తియుతమైన కర్తవ్యాన్ని నిర్వహించండి. జపాను సైనికులతో వీరోచితంగా పోరాడండి."

"జపాను సైనికులతో పోరాడినంతకాలం మాపనల్లా తిరోగమనమే. అసలు పోరాడాలనే ఉద్దేశం మా పైఅధికారులకు ఉంటేగా మాకు ఉంటానికి?

"1945 లో కమ్యూనిస్టులపై యుద్ధం ప్రారంభించాము. అప్పుడు మాత్రం మా పైఅధికారులు తుపాకిపట్టుకొని మా వెనకాల నిలబడేవారు. కియాంగ్సు రాష్ట్రంలో కమ్యూనిస్టులపై యుద్ధంచేసి, మొదట్లో పురోగమించాము. కాని, మళ్లా వెంటనే కమ్యూనిస్టులు మా ఆటలు కట్టించారు.

(తర్వాత కామ్రేడ్ చాన్ టే-యూ చెప్పినవిషయాలను విధిలేక వదలిపెట్టవలసి వస్తున్నందుకు చింతిస్తున్నాను. అనవసరమైన వివరాలను పేర్కొన్నాడు. పైగా, కుమింగ్‌టాంగ్ సైనికుడుగా, ప్రజా సైనికుడుగాకూడా గత విషయాలను చెప్పటంవల్ల 'మేము' అన్నపదం ఒకప్పుడు కమ్యూనిస్టులను, మరొకప్పుడు కుమింగ్‌టాంగ్ సైనికులకు వర్తింపచేస్తూ మాట్లాడాడు. కాని మొత్తంమీద అతను చెప్పినదానినిబట్టి పరిస్థితులు కుమింగ్‌టాంగ్‌కు వ్యతిరేకంగా పరిణమించినవని తేలుతుంది.)

"1947 సంవత్సరాంతంలో మేము కొత్త అమెరికన్ నౌకలలో ప్రయాణంచేస్తున్నాము. ఆనౌకలపై చైనా జెండా ఎగురుతోంది. మంచూరియాలోని చిన్‌చౌ చేరుకొన్నాము. మా సైన్యాధికారి జనరల్ వాంగ్ టింగ్ హాన్ వచ్చి మా వద్ద ఉత్తరకుమారప్రజ్ఞలు పలికాడు. దాదాపు గంటసేపు కోతలు కోసాడు. "ఇదిగో త్వరలోనే కమ్యూనిస్టులను సర్వనాశనం చేసి తీరుతాం". వారం రోజులన్నా తిరిగిరాక మునుపే కమ్యూనిస్టుల చక్రబంధంలో మేము చిక్కుకొనిపోయాము. జనరల్ వాంగ్ టిన్ హాన్ రైతులవద్ద పాతదుస్తులుకొనుక్కొని, వాటిని ధరించాడు. ఒక గాడిదనుకూడా ఖరీదుచేసి, దానిమీద ఎక్కి దొంగచాటుగా తప్పించుకొనిపోయాడు. మేము లొంగిపోయాం."

"మరి మీ తల్లిసంగతి ఏమైంది?" అని ప్రశ్నించాను.

"ఏమౌతుంది? అడుక్కుంటూనే, 1947 లో చనిపోయింది. మా అమ్మ చావుకు ఎవరు కారకులో, వారిపై కసి తీర్చుకుంటున్నాను" అని తన గాథను ముగించాడు కామ్రేడ్ చాన్ చే-యూ.

# నాలుగో భాగం

## 1

యుంగ్‌పావో గ్రామం. హెంగ్‌యాంగ్-క్వీలిన్ రైలు మార్గంపై ఉంది. ఆ గ్రామం బొగ్గుగనులకు ప్రసిద్ధి. కాస్త దూరాన నుంచి చూస్తే, ఆ గ్రామం పరిశుభ్రంగా ఉన్నట్లూ, అక్కడి ప్రజలు సుఖంగా జీవిస్తున్నట్లూ మనకు తోస్తుంది. అయితే అక్కడి ప్రజలలో యధార్థజీవితాలకు, పైకి కనబడే పటాటోపానికి సంబంధం లేదని గ్రామంలో ప్రవేశించినతర్వాత అర్థమౌతుంది.

బొగ్గుగనులకు చెందిన ఉద్యోగులకు జపానువాళ్ళు, కుమింగ్‌టాంగ్ అధికారులు చక్కని ఇళ్ళను నిర్మించారు. ఊళ్ళో ప్రవేశించగానే మనకు ముందుగా కనిపించేవి అలాంటి ఇళ్ళే.

గనులలో పనిచేసే కార్మికులు, రైతుల ఇళ్ళను అద్దెకు తీసుకొని, ఆ కొంపలలో నివసిస్తున్నారు. ఆ ఇళ్ళు మురికి కూపాలవంటివి.

బజార్లలో జనం గుంపులుగుంపులుగా తిరుగుతున్నారు. అంతమంది జనంలోకూడా కాస్త కండపుష్టికలవ్యక్తి ఒక్కడూ నాకు కనిపించనేలేదు. వారి మొఖాలలో జీవకళ కనిపించదు. వారి శరీరాలు శవాకారంలో కనిపిస్తాయి.

పిల్లలుమాత్రం పుష్టిగా, బొద్దుగా, కిలకిలలాడుతూ కనిపించారు. చైనాదేశ ప్రజలలో ఒక విశిష్ట సంప్రదాయం ఉంది. పెద్దలు పస్తుంటారుకాని, పిల్లలనుమాత్రం ఆకలిజ్వాలలను గురికానీయరు. అంత అల్లారుముద్దుగా తమ పసిపాపలను పోషిస్తారు. అయితే ఆపసికందులు పొందే సౌఖ్యం "మూణ్ణాళ్ళ ముచ్చట"వంటిది. పది పన్రెండుపళ్ళు నిండగానే, పెద్దలవలె వారుకూడా అహోరాత్రులు కాయకష్టంచేసి, శల్యావసిష్టులుగా తయారవుతారు. ఇదీ నిన్నటివరకు ఉన్న పరిస్థితి.

నవచైనాలో నూతనశకం ప్రారంభ మవుతోంది. నవ చైనా భావి రూపురేఖలనుగురించి తలుచుకుంటున్నాను. ఆ పసికందుల జీవితాల సర్వతోముఖ వికాసానికి అవకాశాలు ఏర్పడినవి. నవచైనాలో నూతన వ్యవస్థను, భూతలస్వర్గాన్ని భావిపౌరులైన ఈ బాలురు నిర్మించుకొనితీరుతారు.

క్రితంరాత్రి ఒకవైజ్ఞానికప్రదర్శనం చూసాను. ఈ సందర్భంలో చైనా వైజ్ఞానికరంగంగురించి కొంతవరకు వివరిస్తాను.

చైనాదేశమంతటా ఎమిచ్యూర్ వైజ్ఞానికదళాలు అనేకం ఉన్నాయి. ప్రజలలో ఆ దళాలు పేరుప్రఖ్యాతులు బడిసాయి. కుమింగ్‌టాంగ్ పరిపాలనలోకూడా ఆ వైజ్ఞానికదళాలు విప్లవ కర్తవ్యాలను జయప్రదంగా నిర్వహించగలిగాయి.

పల్లెపట్టు ప్రాంతాలలో ఈ దళాలకృషి బహుముఖాలుగా వ్యాపించింది. కొత్తవాళ్ళేకాక, పూర్వం ఆయా రంగాలలో అనుభవంకల నటులు, కవులు, గాయకులు ఈదళాలలో చేరారు. విప్లవ పోరాటకాలంలో విప్లవకర సాహిత్యం,

సంస్కృతి ప్రజలలోకి చొచ్చుకుపోయింది. ముఖ్యంగా ఈ దళాలు ప్రజాసైన్యానికి వినోదాన్ని, విజ్ఞానాన్ని ఒనగూర్చి పెట్టేవి. అసలు ప్రజాసైన్యం ప్రచారకదళం అనే ఒక శాఖ ఉంటుంది. ఆ రంగానికి కావలసిన పరికరాలు ఆ దళాలవద్ద ఉంటాయి. ప్రజలలో రాజకీయాలను ప్రచారం చేయటానికి కళలు చక్కని సాధనాలని రుజువైంది.

వారి ప్రదర్శనలు సులభగ్రాహ్యంగాను, కళాత్మకం గానూ ఉండేవి. నవచైనాలో కళారంగం ఉరకలు పెట్టుకుంటూ ముందుకు సాగుతోంది.

నేను చూసిన నాటకంయొక్క ఇతివృత్తాన్ని ఇక్కడ ఉదహరిస్తాను. ఆ కథ ఈక్రిందివిధంగా నడుస్తుంది:

ఒకానొక సైనిక డివిజన్ సమావేశం. అంతకుపూర్వం ఆ డివిజన్ సాగించిన పోరాటంలోని లోపాలను చర్చించుకోటానికి ఆ సమావేశం ఏర్పాటయింది. ఆ డివిజన్‌లోగల వివిధ పటాలాలు తమతమ ప్రతినిధులను ఎన్నుకొంటున్నాయి. సహజంగా వీరోచితకార్యాలు సాగించినవారినే ప్రతినిధులుగా ఎన్నుకోటం పరిపాటి; కాని, ఒక పటాలం నాయకుడు, సైనికులు కలిసి చిన్న గమ్మత్తు చేస్తారు. వారిలో ఉన్న ఒక దద్దమ్మను తమ ప్రతినిధిగా ఎన్నుకొంటారు.

ఇక చూడండి! ఆ సైనికునికి జరిగే సన్మానాలు ఇన్నీ అన్నీ కావు. అదంతా ఎందుకు జరుగుతున్నదో మొదట అతనికి అర్థంకాలేదు. జనం అంతా అతనిని తెగ పొగడసాగారు. అప్పుడు అతను అర్థంచేసుకుంటాడు. వీరుడనే ఉద్దేశంతో ప్రజలు తనను గౌరవిస్తున్నారని తెలుసుకుంటాడు. వీరుడనని నిరూపించుకోవాలనే నిర్ణయానికి వస్తాడు.

చివరిసీనులో పోరాటం జరుగుతుంది. ఆ పోరాటంలో ప్రాణానికి తెగించి, శత్రుశ్రేణులను ఛేదించుకుంటూ పోయి, ఒక కొండపై అరుణపతాకాన్ని ఎగరవేస్తాడు ఆ సైనికుడు. అంతటితో తెర పడుతుంది.

ఆ నాటకాన్ని చాలా సహజంగా ప్రదర్శించారు. సైనికులు దానిని చూసి విపరీతంగా ఆనందించారు.

## 2

తెల్లవారింది. ఆ గ్రామాన్ని విముక్తం చేసిన ప్రజా సైన్యం జైత్రయాత్రను కొనసాగించే నిమిత్తం ఖాళీచేసి వెళ్ళిపోతోంది. ఇంక రెండు గంటలలో నేనూ ప్రయాణంకావాలి. ఈ లోపల ఆ గ్రామం పూర్వపు స్థితిగతులను తెలుసుకోవాలనుకున్నాను. సైనిక విప్లవకమిటీ ప్రతినిధి కామ్రేడ్ టున్ సిద్ధహస్తుడైన గని కార్మికుడు; కామ్రేడ్ లూ క్వాంగ్-మింగ్ ప్రశ్నలకు సమాధానా లిస్తున్నారు.

కామ్రేడ్ టున్ వయస్సు పాతిక ఏళ్ళకు మించదు. ఉత్సాహవంతుడు. ఇంతకుపూర్వం హార్బిన్‌లో మెటల్ కార్మికుడుగా పనిచేసాడు. యుంగ్‌షావో గనులలో తిరిగి పని ప్రారంభమయ్యేట్టు చూడమని పార్టీ అతనిని పంపింది.

కామ్రేడ్ లూ క్వాంగ్-మింగ్ వయస్సు ఏభై ఏళ్ళు. శుభ్రమైన దుస్తులు ధరించాడు. యుంగ్‌షావో గనులనుగూర్చి వారిచ్చిన కథనం ఇది.

1938 లో జపానువాళ్ళు యుంగ్‌షావో గనులను తవ్వారు. జపానువారికోసం ప్రత్యేకంగా గృహాలను నిర్మిం

చారు. కార్మికులతో పగలల్లా పనిచేయించుకొని, కడుపు నిండా కూడుకూడా పెట్టేవాళ్ళుకాదు. జపానువాళ్ళు 7 సంవత్సరాలపాటు, అంటే 1945 వరకు ఆ గనులపై పెత్తనం సాగించారు.

జపాను పతనానంతరం ఆ గనులు కుమింగ్‌టాంగ్ ప్రభుత్వం స్వాధీనమయాయి. వాటిపై అజమాయిషీ చూసేందుకు 'సహజసంపత్తిసంఘం' అనే నామకేవాస్తే సంఘాన్ని నియమించారు. ఆ సంఘాన్ని 'ధనార్జనసంఘం' అని పిలిస్తే సరిపోతుంది.

కుమింగ్‌టాంగ్ ప్రభుత్వం ఆ గనులకు మేనేజరుగా ఎవరి నియమించిందో తెలుసా? మిస్టర్ టావో సింగ్. అతగాడికి గనులవిషయం బొత్తిగా తెలియదు. అంతకు పూర్వం షాంఘైనగరంలో కూర్చొని గానకచ్చేరీలు చేస్తుండేవాడు. కుమింగ్‌టాంగ్ పార్టీకి బంటుకావటమే అతనికిగల అర్హత. అలాంటి మహానుభావుడు గనులకు మేనేజరు అయితే ఇక ఆ గనులనుంచి త్రవ్వే బొగ్గువిషయం వేరే చెప్పాలా?

టావో సింగ్‌నుగురించి చైనా కామ్రేడ్స్ చెప్పేటప్పుడు వారి మాటల్లో వ్యంగ్యం ఇమిడిఉంది. అసమర్ధ కుమింగ్‌టాంగ్ పార్టీ అంతకన్నా ఇంకేంచేస్తుందని వారి నిశ్చితాభిప్రాయం.

పోతే ప్రస్తుతపరిస్థితులను గురించి ఇలా వివరించారు:

నాలుగు నెలలనుంచి కుమింగ్‌టాంగ్ ప్రభుత్వం కార్మికులకు వేతనాలు ఇవ్వలేదు. కార్మికులకు వెంటనే ఆ నాలుగు నెలల జీతాన్ని చెల్లించాలని సైనికవిప్లవ కమిటీ నిర్ణయించింది.

కామ్రేడ్ టు సిన్ వచ్చినవెంటనే కార్మికులను, ఇంజనీర్లను, టెక్నీషియన్లను సమావేశపర్చాడు. ఆ సమావేశా

లలో కొన్ని సంగతులు బయటపడినవి. లోగడ ప్రతిఉద్యోగి క్రింద ఇద్దరు నౌకర్లు ఉండేవారు. వారిని కుమింగ్‌టాంగ్ ప్రభుత్వమే భరించేది. చివరిదశలో గని కార్మికులకు ఒకటిన్నర రెట్లు ఉద్యోగులు ఉండేవారు. అందువల్ల ఇప్పుడు ఆ ఉద్యోగుల నందరినీ పనినుంచి తొలగించి వేరేపనులకు పురమాయించటం జరిగింది. కార్మికులు, ఇంజనీర్లు సమావేశమై ఉత్పత్తిని అధికంచేయటానికి ప్లానులు వేస్తున్నారు.

ఇంక వ్యవధిలేదు. నాకోసం మనిషివచ్చాడు. స్టేషన్‌కు బయలుదేరి వెళ్ళాను.

# అయిదో భాగం

## 1

ఆ మరుసటిరోజు ఉదయం టంగన్ పట్టణం చేరుకున్నాం. నిజానికి అదొక పెద్ద గ్రామం మాత్రమే. జపాను ఫాసిస్టులు ఆగ్రామాన్ని దగ్ధపటలం కావించారు. జపాను బాంబుల పుణ్యమా అంటూ ఆవూళ్లో ఉన్న మూడువందల గృహాలలో రెండువందల ఇళ్లు నేలమట్టమయ్యాయి. జనాభా సగానికి తగ్గిపోయింది.

కుమింగ్‌టాంగ్ ప్రభుత్వం ప్రతి పట్టణంలో రక్షణ కేంద్రాలను నిర్మించింది. నిజానికి అవి రక్షణ కేంద్రాలు కానే కావు. "నీవు నేర్పినవిద్యే నీరజాక్ష" అని కుమింగ్‌టాంగ్ సైనికాధి

కారులు చాంగ్ కై షేక్‌కు పాఠం అప్పగిస్తూన్నారని ఆ రక్షణ కేంద్రాలను చూస్తే స్ఫురిస్తుంది. చాంగ్ కై షేక్ వలెనే సైనికోద్యోగులుకూడా ప్రతి విషయాన్ని స్వార్థ ప్రయోజనాలకు వినియోగించుకుంటున్నారు. రక్షణ కేంద్రాలకు కేటాయించిన సొమ్మును కాజేసి, నామమాత్రమైన కేంద్రాలను సైనికాధికారులు నిర్మించారు. అలాంటి నామమాత్రమైన రక్షణ కేంద్రం టుంగన్‌లో ఉంది.

ఆ రక్షణకేంద్రం గోడలనిండా పోస్టర్లే. సాయుధుడైన సైనికుడు, రైతు నిలబడి నక్క రూపంలోవున్న చాంగ్ కై షేక్‌ను తరిమికొట్టే బొమ్మ చక్కగా చిత్రించబడిఉంది. ఒక గోడమీద పైభాగంలో "చైనా రక్షకుడు చాంగ్ కై షేక్" అనీ, దానిక్రింద భాగంలో "తప్పిపోయాడు. సజీవుడైన పాయ్ సుంగ్ సిని పట్టుకోండి." అని రాసిఉంది.

ప్రయాణపు బడలికతో ప్రజా సైనికులు నేలపై మైమరచి నిద్రపోతున్నారు. కొంతమంది సైనికులు గుర్రాలకు గడ్డిని నలగగొట్టుతున్నారు.

ఆ వూరికి ప్రక్కనే కొండపై పెద్ద దేవాలయం ఉంది. అదిచాలా పురాతనమైన గుడిలా కన్పిస్తోంది. ఆ దేవాలయపు గోడలపైకూడా అనేక రాజకీయ నినాదాలు వ్రాయబడి ఉన్నాయి. ఆ నినాదాలు విరుద్ధాభిప్రాయాలను వ్యక్తం చేస్తున్నాయి. అంటే ప్రజా సైనికులు కుమింగ్‌టాంగ్ సైనికులుకూడా ఆగోడలపై వ్రాశారన్నమాట. "కుమింగ్‌టాంగ్ తుదిక్షణం వరకు పోరాడుతుంది" దీని ప్రక్కనే తాబేలు రూపంలో చాంగ్ కై షేక్ బొమ్మ. ఆ బొమ్మకింద "క్వాంగ్సీకి పోతాం, క్వాంటుంగ్‌కు పోతాం, మళ్లా మాట్లాడితే ఫార్మో

జాకే పారిపోతాం" అని వ్రాసిఉంది. ఒక గోడపై పెద్ద పెద్ద అక్షరాలలో "సమత్వం, నిజాయితీ, శాంతి" అని వ్రాసిఉంది. అవి సన్ యట్ సేన్ నాటి కుమింగ్ టాంగ్ నినాదాలు. కుమింగ్ టాంగ్ అధికారులు పైఆశయాలకు ఏనాడో తులసినీళ్లు వదిలారు.

ఎవరో మహానుభావుడు ఆ గోడపై ఒక ప్రవచనం రచించిపోయాడు. ఆయన ఉద్దేశం ఏమైనాగానీ, ఆ ప్రవచనం అక్షరాల నేడు నిజమైంది. "చైనాదేశ భవిష్యత్తును నిర్ణయించగలిగింది ప్రజలే. ప్రజల శక్తియుక్తులపైన, స్వేచ్ఛపైన ఆ భవిష్యత్తు ఆధారపడి ఉంటుంది. ఆశక్తియుక్తుల్ని, స్వేచ్ఛను వారు ప్రదర్శించగలిగితే, నవచైనాను నిర్మించగలరు." ఈ విషయంలో భేదాభిప్రాయానికి ఎట్టి తావులేదు. చైనా ప్రజలు చాంగ్ కై షేక్‌ను తన్నితరిమేసారు. నవచైనానునిర్మిస్తున్నారు.

భూస్వాములు, జమీందార్లు రైతులనుంచి నిర్బంధంగా డబ్బు వసూలుచేసి గుళ్ళను కట్టించే అలవాటు చైనాలో కూడా ఉంది. ఉత్తర చైనా ప్రజలలోకన్నా హ్యూనాన్ రాష్ట్ర ప్రజలలో దైవభక్తి, మూఢాచారాలు మెండు. దేవాలయ పూజార్లు భూస్వాములకు అండగా ఉంటారు. చైనా దేవాలయాల పేర కొంత భూమి ఉంటుంది. ఆ భూమి ఫలసాయాన్ని అనుభవించేది ఆ పూజార్లే.

## 2

కారణాంతరాలవల్ల టుంగన్ నుంచి నా ప్రయాణం రేపటికి వాయిదాపడింది. అందువల్ల కామ్రేడ్ కావోతో ఆ సాయంత్రం గడిపాను. ప్రజానురంజకోద్యమ శాఖకు

కాంట్రమేడ్ కావో అధిపతి. రాజకీయ శాఖలో 'ప్రజాను రంజకోద్యమం' ఒకభాగం. దీనినిగురించి ఇక్కడ కొంత విపులంగా చెప్పాలి.

కొత్తగా విముక్తమైన ప్రాంతంలోగల ఆచార వ్యవహారాలను, సంప్రదాయాలను, ఆస్తిపాస్తుల వివరాలను మొదట 'ప్రజానురంజకోద్యమ శాఖ' సేకరిస్తుంది. ఆ విషయ సేకరణానంతరం ప్రజా సైనికులు ఫలానా ప్రాంతంలో ప్రజలతో ఎలా సన్నిహిత సంబంధాలు పెట్టుకోవాలో ఆ శాఖ వివరిస్తుంది. ప్రజాసైన్యంలోని వారంతా ఒక సూత్రం పాటించాలి. సైనికుడుగానీ, అధికారిగానీ ప్రజలలో రాజకీయ ప్రబోధం విధిగా చేసితీరాలి.

దక్షిణ హ్యూనాన్‌లో కుమింగ్‌టాంగ్ బలగం పారిపోతూ, ఒక విధమైన తప్పుడు ప్రచారంచేసి పోయింది. కమ్యూనిస్టులు వచ్చిన వెంటనే "యువకులకోసం వేట" ప్రారంభిస్తారనీ, ఆ విధంగా నిర్బంధంగా సైన్యంలో చేర్చుకుంటారనీ, పేదప్రజలను సైతం కొల్లగొట్టి గుల్ల చేస్తారనీ అబద్ధాలు ప్రచారంచేసి పోయారు. అందువల్ల ప్రజాసైనికులు ఆ అబద్ధప్రచారంపై దృష్టిని కేంద్రీకరించి, ప్రజలలో రాజకీయప్రచారం సాగించాలని 'ప్రజానురంజక' ఉద్యమంవారు నిర్ణయించారు.

టుంగన్‌ప్రాంతంలో ఏదైనా ఖరీదుచేయవలసి వస్తే అది నగదుపద్ధతిపై మాత్రమే జరగాలి. ఆ ప్రాంతంలో అదొక సంప్రదాయం. కనుక ప్రజాసైనికులు అరువు పద్ధతిపై ఖరీదు చేయరాదని స్పష్టంగా ఆదేశించారు.

"కమ్యూనిస్టులు చెప్పేది చేస్తారు" అని ప్రజలలో విశ్వాసం ఏర్పడాలంటాడు కామ్రేడ్ కావో. ప్రజల మనోగత భావాలను అవగాహన చేసుకోటానికి కామ్రేడ్ కావో ప్రజలతో సన్నిహిత సంబంధాలు పెట్టుకునేవాడు. కామ్రేడ్ కావో నిన్న ఒక చిన్న వ్యాపారి ఇంటికి వెళ్లాడు. ఆ వ్యాపారికి, కామ్రేడ్ కావోకు మధ్య నడచిన సంభాషణ ఇది :

"మేమంటే మీరు భయపడుచున్నారా?" అని కావో ప్రశ్నించాడు.

"మీరంటే మాకు భయమెందుకు? ప్రజలను మీరు చక్కగా చూస్తారని విడుదలైన యుద్ధఖైదీలు ఇటు పోతూ మాకు చెప్పారు."

"అయితే, అంతకుముందు కుమింగ్‌టాంగ్ చేసిన ప్రచారాన్ని మీరు నమ్మలేదా?"

"ఆ ప్రచారం నిజంకాదని మా మనస్సుకు తోచింది."

"కుమింగ్‌టాంగ్ ముఠా మాది "మూడు ఎడబాటుల" విధానమని_అంటే భార్యలనుంచి భర్తలను, తల్లులనుంచి పిల్లలనూ, తండ్రులనుంచి కొడుకులనూ వేరుచేసే విధానం అని ప్రచారం చేశారుగదా! మాది "మూడుతొలగింపుల" విధానమని, అంటే నివసించే ఇంటినుంచీ, దున్నుకొనే పొలంనుంచీ, పుట్టి పెరిగిన గడ్డనుంచీ రైతులను తొలగిస్తామని వారు మీకు చెప్పారుగదా! నిజంగా మీరు ఆ ప్రచారాన్నికూడా నమ్మలేదా?

"మీరంటే మాకు భయంలేదని మొదటేచెప్పాను. అయినప్పుడు మీతో అబద్ధం చెప్పాల్సిన అగత్యం మాకేం పట్టింది చెప్పండి."

"మీ వ్యాపారం ఎలా సాగుతోంది."

"వ్యాపారం సాగటానికి మావద్ద ఏముందిగనుకా! అంతా ఆ ముండాకొడుకులే ఊడ్చుకపోయారు."

కామ్రేడ్ కావోకు ఈవేళఉదయం టుంగన్ పొలిమేర్లలో ఒక కుర్రాడు కనిపించాడు. ఆ కుర్రాడికి, కావోకి మధ్య జరిగిన సంభాషణ:

"మీ కుటుంబంలో ఎంతమంది ఉన్నారు?"

"పద్దెనిమిదిమంది."

"మరి మీకు పొలము ఎంతఉంది?"

"రెండు కుంటలు"

"మరి మీ జీవనం?"

"కౌలుకు పొలం తీసుకొని సేద్యం చేస్తాం."

"కౌలు రేటు ఎంతఇస్తారు?"

"పంటలో సగం."

"కుమింగ్‌టాంగ్ సైనికులు మీవూరువచ్చారా?"

"ఆఁ! వచ్చారు. మా ఇంట్లో వస్తువుల నన్నింటిని కొల్లగొట్టుకుపోయారు."

"అయితే కొత్తగావచ్చిన సైనికులు మీపట్ల ఎలా ప్రవర్తిస్తున్నారు? మీవస్తువులు ఏమన్నా కాజేస్తున్నారా?"

"వాళ్ళు చాలా మంచివాళ్ళు. అలాంటి పిచ్చిపనులు ఎలా చేస్తారు? మాకు వాళ్ళే కట్టెలు కొట్టిపెట్టారు. ఆ కట్టెలు మాకు నెలరోజులు సరిపోతాయి. సరేకాని, మరి మాకు పొలం ఎప్పుడు పంచిపెడతారండీ?"

చూస్తే ఆకుర్రాడికి నిండా పంద్రెండు ఏళ్లు లేవు. భూమిమీద ఎంత అపేక్షో చూడండి! కామ్రేడ్ కావో హ్యూనాన్ రైతుల పరిస్థితులను ఇలా వివరించాడు :

1925_27 విప్లవం విఫలమైన తరువాత భూస్వాములు చిన్నకారు రైతులపై విరుచుకపడ్డారు. అనేకమంది రైతులను నిలువునా కాల్చి చంపారు. హ్యూనాన్ రాష్ట్రంలో విపరీతమైన కౌలు రేట్లు, వడ్డీ రేట్లతో రైతులు యమయాతనలు అనుభవిస్తున్నారు అని చెప్పాడు.

కామ్రేడ్ కావోవద్ద సెలవుతీసుకున్నాను. కామ్రేడ్ కావోలో కలుపుగోలుతనం ఉంది. సౌశీల స్వభావంగల వ్యక్తి. వ్యవసాయసంస్కరణలను అమలుజరపటానికి తగినవాడు. ఆయన హృదయం ఎప్పుడూ తప్పటడుగు వేయదు అని మనసులో తీర్మానించుకొన్నాను.

## 3

123 వ డివిజన్‌ను చేరుకోవటానికి నేనుబయలుదేరాలి. కాస్త వ్యవధి చిక్కింది. కామ్రేడ్ వాంగ్ లియాన్-సివచ్చాడు. టుంగన్ జిల్లా సెక్యూరిటీ సర్వీసులో పనిచేస్తున్నాడు. టుంగన్ జిల్లాలోని స్థితిగతులనుగూర్చి ఆయననుంచి మరికొంత సేకరించాను.

కామ్రేడ్ వాంగ్ నవయువకుడు. పేదరైతుకుటుంబంలో జన్మించాడు. చిన్నప్పుడు గొడ్లకాపరి; తర్వాత చెప్పులషాపులో నౌకరి. పార్టీ సభ్యుడు. పార్టీ స్కూలులో శిక్షణ పొందాడు.

నిన్న ఉదయం కుమింగ్‌టాంగ్ విమానాలు టుంగన్ ప్రాంతంలో బాంబులువేసి పోయాయి. 1944 లో టుంగన్‌పై జపానువాళ్ళు కురిపించిన అగ్నివర్షం కారణంగా ప్రజలు విమానదాడులంటే భయపడిపోతున్నారు. అందువల్ల చాలా మంది పట్టణవాసులు టుంగన్‌నుంచి ఖాళీచేసారు.

సెక్యూరిటీ సర్వీస్‌వారు ప్రస్తుతం సాగిస్తున్న కృషి ఏమిటని అడిగాను.

"ధాన్యం వసూలుచేస్తున్నాము. పేదరైతులధాన్యంలో ఒక్క గింజకూడా ముట్టుకోటంలేదు. భూస్వాములనుంచి, ధనిక రైతులనుంచి మాత్రం ధాన్యం వసూలుచేస్తున్నాం. ధాన్యం వసూలు చేయటంలో పేదరైతులు మాతో పూర్తిగా సహకరిస్తున్నారు. భూస్వాములు ధాన్యాన్ని ఎక్కడదాచినా సరే, ఆ సమాచారాన్ని రైతులు మాకు అందజేస్తున్నారు."

"కుమింగ్‌టాంగ్ గూఢచారులు ఈప్రాంతంలోలేరా?" అని ప్రశ్నించాను.

"ఉండి ఉంటారు. పరిస్థితులు కుదుట పడినతరువాత వారివిషయంలో పూర్తి దర్యాప్తుజరిపి తేల్చుకుంటాం."

ఇంతలోకి నాకు పిలుపువచ్చింది వెంటనే బయలుదేరి రమ్మని. జనరల్ లి పో-చెంగ్‌బలాలు జెచ్వాన్ సరిహద్దులను అధిగమించినవనీ, దక్షిణాన క్వీచౌరాష్ట్రంలో చొచ్చుకొని పోయి రాజధాని క్వీయాంగ్‌దిశగా పురోగమిస్తున్నవని వర్తమానం వచ్చింది. దానినిబట్టి రేపు ఉదయమే దండయాత్ర ప్రారంభమవున్నదని అర్థం చేసుకున్నాను.

# 4

కొన్ని మైళ్లు గుర్రాలపైననూ, మరికొన్ని మైళ్ళు కాలి నడకనూ ప్రయాణం సాగించాము. చీకటిపడేటప్పటికి 123వ డివిజన్ కేంద్ర కార్యాలయం చేరుకొన్నాము. సహారా ఎడారి ఉన్న అక్షాంశరేఖపై మేమిప్పుడున్న ప్రాంతంఉంది. అందువల్ల పగలు ఎండ మాడ్చేస్తోంది.

హ్యూనాన్ రాష్ట్రం సరిహద్దుదాటి క్వాంగ్సీరాష్ట్రంలో ప్రవేశించాము. 123 వ డివిజన్ వెన్నాడి హతమార్చవలసిన కుమింగ్‌టాంగ్ సైన్యం చాలారోజులక్రితమే పలాయనం ప్రారంభించిందని తెలిసింది. 4 వ పదాతి సైన్యాధిపతి చెప్పినమాటలు గుర్తుకొచ్చాయి. శత్రువుకు తెలియకుండా శత్రుబలాల ఉభయపార్శ్వాలను ఛేదించుకొని ప్రజాసైన్యం ముందుకు సాగటం మంచిదని ఆయన ఆనాడు చెప్పాడు. కాని, శత్రువులు ప్రజాసైన్యాన్ని పసికట్టినట్టున్నారు. అందకుండా పారిపోతున్నారు.

పొద్దుగూకింది. 7 గంటలయింది. అయినా ముందుకు సాగమని సైన్యానికి ఇంకా ఆదేశం అందలేదు. ఏదో జరిగి ఉంటుంది. తీరిక దొరికిందికనుక మొఖం, చేతులు అక్కడి సంప్రదాయంప్రకారం కడుక్కున్నాను. వేడినీళ్ళలో ముంచిన తడిగుడ్డతో తుడుచుకొటం ఆ ప్రాంతపు సంప్రదాయం.

తర్వాత భోజనాలు. అన్నం, పులుసుమాత్రం తయారుచేశారు. ఈ సందర్భంలో బూర్జువా పత్రికలు సాగించే అసత్య ప్రచారాన్నిగురించి ప్రస్తావించాలి.

రష్యన్ సైనికునివలె చైనా సైనికులుకూడా గొడ్డుల్లాగా కష్టాలకు అలవాటుపడ్డారని ఆ పత్రికలు దుష్ప్రచారం

చేస్తున్నాయి. కాని ఇతర సాధారణ మానవులవలె చైనా విప్లవ సైనికులుకూడా కష్టపడి పిదప చక్కటి నిద్ర, విశ్రాంతి భోజనం కావాలని కాంక్షిస్తారు.

అవసరంవస్తే వేరు సంగతి. విప్లవ కర్తవ్యాలను నిర్వహించటంలో రష్యన్ సైనికునివలె చైనా సైనికుడుకూడా ఎన్ని కష్టాలనైనా హృదయ పూర్వకంగా భరిస్తాడు. అంటే అర్థం ఆ సైనికుడు "అలా తయారయ్యాడు" అనిగానీ, అతనికి "అంతకన్నా ఇంకేమీ అవసరంలేదని" గానీ కానేకాదు. విప్లవ సంకల్పంవల్ల అతను ఆ కష్టాలను సహిస్తున్నాడు. కమ్యూనిస్టుపార్టీ శిక్షణవల్ల అలాంటి సద్గుణం పొందాడు.

డివిజనల్ కమాండర్ వచ్చాడు.

"లి హో-చెంగ్ బలాలు క్వీయాంగ్‌ను హస్తగతం చేసుకొన్నాయని రేడియోవార్త. మనం వెంటనే దండయాత్ర ప్రారంభించాలని పైనుంచి ఆదేశం వచ్చింది."

# ఆరో భాగం

## 1

అయిదురోజుల 'మార్చి' అనంతరం క్వీలిన్ ప్రజా సేనల హస్తగతమైంది. క్వాంగ్సీ రాజధాని క్వీలిన్‌లో ప్రవేశించాము. ప్రజాసైనికులు వీధులు ఊడ్చి నగరాన్ని పరిశుభ్రం చేస్తున్నారు.

క్వీలిన్‌లో నేను జైలును మొట్టమొదట చూడదలుచుకున్నాను. నగరానికి ఒక కొసను ఉంది ఆ జైలు. జైలు ఆవరణలో ప్రవేశించాము. జైలు భవనపు గోడలపై అనేక పిచ్చి వ్రాతలు వ్రాయబడి ఉన్నవి. ఆ జైలులో నివసించేవారి మనస్తత్వం ఎలా ఉంటుందో చూడండి: "నాకు ఇక్కడ పిచ్చెక్కింది. కలకాలం నిలుస్తుంది ఆ పిచ్చి. ఇతరులకన్నా ఉన్నత స్థితికి చేరుకోవాలంటే ఉన్న ఏకైకమార్గం ఇదొక్కటే కావచ్చు."

కొన్ని ఖైదీలగదులను తెరచి చూసాం. అవన్నీ ఖాళీగా ఉన్నాయి. ఆ గదులనిండా చెత్తా, చెదారం, దుర్గంధం ఇంకా ముందుకుసాగాం.

భరింప శక్యంకాని దుర్వాసన. ఒక గదిలో, చెత్త, చెదారం మధ్య పదేళ్ళబాలుడి శవం కుళ్ళి కంపుకొడుతోంది.

"ఈ కుర్రాడి శవం ఇక్కడ ఎందుకుపడి ఉంది" అని నావెంట వచ్చిన చైనా కామ్రేడ్‌ను ప్రశ్నించాను.

"ఆ ప్రశ్నకు సమాధానం చెప్పటం కష్టం. వాళ్లు (కుమింగ్‌టాంగ్‌ముఠా) దేనికి ఒడిగట్టటానికైనా సమర్థులే."

జైలు మధ్యభాగంలో నిలబడి ఉన్నాము. పదేళ్ళ కుర్రాడి శవం నేలపై పడిఉంది. ఆ శవం ఇక్కడెందుకు పడి ఉంది? ఆ పసికందు ఏ నేరంచేశాడు? ఎందుకు యిక్కడ చచ్చిపోయాడు? ఈ ప్రశ్నలకు సమాధానాలు దొరకవు. సమాధానాలు చెప్పటంకూడా సాధ్యంకాదు. క్వీలిన్, చాంగ్షా, నాన్‌చాంగ్, కాంటన్, షాంఘై, ఇంకా అనేక వేలాది పట్టణాలలో, లక్షలాది గ్రామాలలో కుమింగ్‌టాంగ్ ముఠా సాగించిన కోటానుకోట్ల పైశాచిక కృత్యాలు ఎందుకు జరిగాయంటే ఏం సమాధానం వస్తుంది కనుక!

ఇప్పుడుకూడా, ఈ క్షణంలోకూడా కొన్నివందలమైళ్ళ ఆవల, కుమింగ్‌టాంగ్ అధీనంలోగల ప్రాంతంలో ఎన్నిఘాతుక కృత్యాలు జరుగుతున్నాయోగదా! అంతేకాదు. మరికొన్ని వేల మైళ్ళ ఆవల మిత్రరాజ్యసమితిలో, న్యూయార్కులో ఈ పైశాచిక కృత్యాలు సాగించే పరమ కిరాతకుని సోదరులు, డాలరు ప్రభువులు 'జీవకారుణ్యం' గురించీ, 'అభ్యుదయం' గురించీ, 'స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను' గురించీ దీర్ఘోపన్యాసాలు చేస్తూనే ఉన్నారు.

పరమనీచులు, దుర్నీతిపరులు, భీరులు, మృగప్రాయులూ కలిసి కుమింగ్‌టాంగ్ ముఠాగా ఏర్పడ్డారు. సోవియెట్ పౌరుడుగా ఆ ముఠాసాగించే పైశాచిక కృత్యాలు ఎంత త్వరగా అంతమైపోతాయాఅని ఇంతకాలం హృదయావేదనతో ఎదురు చూస్తూవచ్చాను. నా కోర్కె నెరవేరుతోంది.

జైలునుంచి తిరిగివస్తున్నాము. "ప్రజా సైన్యానికి సుస్వాగతం" అనే బ్యానరుతో యువకులు వీధులలో ఊరేగుతున్నారు. కొంతమంది తలుపుసందుల్లోంచి భయంతో తొంగి చూస్తున్నారు. కుమింగ్‌టాంగ్ తొత్తులు సాగించిన తప్పుడు ప్రచారాన్ని కొందరు నమ్మిఉంటారు

ఒక కుమింగ్‌టాంగ్ పత్రికా కార్యాలయానికివెళ్లాము. అక్కడ ముగ్గురు యువకులు కూర్చొనిఉన్నారు. మమ్మల్ని చూడగానే వారి కాళ్ళు, చేతులు వణకటం ప్రారంభించాయి. పత్రికా కార్యాలయాన్ని స్వాధీనపరుచుకోటానికి వచ్చామని వాళ్లు భావించి ఉంటారు. అందుకోసం రాలేదని చైనా కామ్రేడ్ వివరించి చెప్పాడు. కొన్ని తాజా పత్రికలనుతీసుకొని అక్కడనుండి బయలుదేరాము.

దారిలో ప్రార్థనాలయం మెట్లపై ఒక పెద్దమనిషి కనిపించాడు. సూటూ, బూటూ, హేటూ తగిలించుకున్నాడు. అమెరికానుంచి చైనాకు దిగుమతి అయిన మతాధికారిలా కనిపిస్తున్నాడు. ఈ మతధికారులంతా కాదుకాని, కొంతమంది మాత్రం అమెరికా గూఢచారులుగా వ్యవహరిస్తూన్నారు.

జనరల్ పాయ్ సుంగ్-సి స్వంత ఇంట్లో మా మకాం!

మొన్నటిదాకా క్వాంగ్సీరాష్ట్రం సర్వాధికారి పాయ్ సుంగ్-సి. మొన్నే విమానంలో చుంకింగ్‌కు పలాయనం చిత్తగించాడు.

గదులన్నీ గాలిస్తుండగా మాకు ఒక గ్రంథందొరికింది. నాంకింగ్‌లో 1948లో అచ్చయిన గ్రంథం అంది. "ప్రసిద్ధ కుమింగ్‌టాంగ్ నాయకులు" ఆ గ్రంథరాజంపేరు. ఆహా! ఏమి బొమ్మలు! కుమింగ్‌టాంగ్ సైనికాధికారులు, పెట్టుబడి

దారులు, గుత్తవ్యాపారస్థులు, నరహంతకులు - వారికి ఒకటే ధ్యాస. డబ్బు సంపాదన ఎలా!

సరే. పాయ్ సుంగ్-సి జీవితచరిత్ర వచ్చింది. 1927 లో షాంఘై విప్లవాన్ని రక్తపుటేరుల్లో ముంచెత్తిన ఈ నరహంతకుని చరిత్ర ఎలా లిఖించబడిఉంది?

1948 నాటికి అతగాడు అధిష్ఠించిఉన్న పదవులలిస్టు, అతను సాగించిన "శాస్త్రపరిశోధన" అరపేజీ ఆక్రమించింది. అతను రూపొందించిన "అహం" విధానం పేర్కొన్నారు. నా రక్షణ, నా ప్రభుత్వం, నా స్వార్థం-ఇదే అతని 'అహం' విధానం. అందులో ఆ జనరల్ వ్యక్తిగత సుగుణాలనుకూడా ఉల్లేఖించారు. అందులో అంతాఉంది. 'నరహంతకుడు' అన్న ఒక్కమాట తప్పితే.

పాయ్ సుంగ్-సి తోపాటు మిగతా 99మంది రాజకీయ శవాల చరిత్రగల ఆ గ్రంథాన్ని ఆవలకు విసరిపారేశాము.

వాషింగ్టన్ బంటులనుగురించి కొంత తెలుసుకోవాలని కామ్రేడ్ చెన్‌ను కోరాను.

కామ్రేడ్ చెన్ తండ్రి మేధావి వర్గానికి చెందినవాడు. కామ్రేడ్ చెన్ రహస్యపార్టీ కార్యకలాపాలు సాగించాడు. నవలను వ్రాయాలన్న తలంపుతో ప్రస్తుతం విషయసేకరణలో నిమగ్నమై ఉన్నాడు. కొంతసేపు ఆలోచించి ఈ క్రింది సూచన చేసాడు:

"మొదట మీరు కుమింగ్‌టాంగ్ పత్రికలను పరిశీలించండి. ముఖ్యంగా తాజాపత్రికను.

"తరువాత కుమింగ్‌టాంగ్ సైనికాధికారి మొన్ననే ఖైదీగా చిక్కాడు. అతనితో మాట్లాడండి. చివరకు ఒక

హోటల్ యజమానిని కలుసుకుందురుగాని. అప్పుడు వాషింగ్ టన్ బంటుల విశ్వరూపం మీకు లభిస్తుంది!"

కామ్రేడ్ సుయాంగ్-వెంగ్ క్వీలిన్ నుంచి బయలుదేరి పోతూ సోవియట్ కామ్రేడ్ వద్ద సెలవుతీసుకోటానికివచ్చాడు.

"మనిద్దరం చాలా విషయాలు మాట్లాడుకున్నాము. నేనంత బాగా మాట్లాడలేనని నా యభిప్రాయం. అసలు మీతో చెప్పనేలేదు. ఇప్పుడా టైము లేదు. తప్పకుండా ఉత్తరం వ్రాస్తా. శలవు."

కరస్పర్శచేసి ఆ కామ్రేడ్ గుర్రంఎక్కి వెళ్ళిపోయాడు.

వాషింగ్టన్ బంటులను కలుసుకోవటానికి మేము బయలుదేరాము.

# ఏడవ భాగం

## 1

కుమింగ్ టాంగ్ సైన్యంలో కలోనెలో హోదాతో వ్యవహరించాడు. అతనిపేరు లి పింగ్-చున్. మొన్న నేప్రజా సైన్యానికి ఖైదీగా చిక్కాడు. సైనికునికి ఉండవలసిన కనీస శారీరకస్వాస్థ్యం కూడాఅతనికి లేదు.

పాయ్ సుంగ్ - సి ఇంట్లో నాకు ఎదురుగా కూర్చున్నాడు. బెదురుతో చూస్తున్నాడు. తనకు ఏదో కీడు మూడుతుందని అతను హడలిపోతున్నట్లు కన్పిస్తున్నది. అతను భయపడవలసిన అగత్యం నాకు కనిపించలేదు. అతనిలో ఇంకా

మానవత్వం పూర్తిగా నశించిపోలేదన్న దృష్టితో, సత్ప్రవర్తనుడుగా తయారుచేయటానికి కృషిచేయాలని చైనా కామ్రేడ్స్ నిర్ణయించుకొన్నారు. కలోనెల్ లి పింగ్-చున్‌ను అతని జన్మస్థలమైన హూపే రాష్ట్రానికి త్వరలోనే పంపిస్తారు. స్వయం కృషిపై ఆధారపడి జీవించటానికి అవకాశాలు కల్పిస్తారు.

కలోనెల్ లి పింగ్-చున్‌ను నేను క్రాసుపరీక్షచేయగా అతను ఇచ్చిన సమాధానాలను ఇక్కడ సంగ్రహంగా పొందుపర్చుతాను :

"ఆర్థిక కారణాలవల్ల ఉన్నతవిద్యకు మధ్యలో స్వస్తి చెప్పి, ఉపాధ్యాయ వృత్తి స్వీకరించాను. 1937 లో చైనాపై జపాను దండయాత్ర ప్రారంభించింది. దేశ స్వాతంత్ర్య రక్షణ కోసం, నిర్బంధంతో పనిలేకుండానే సైన్యంలో చేరాను. శిక్షణ పూర్తి అయిన పిమ్మట షాంటుంగ్ యుద్ధరంగానికి నన్ను పంపారు. ఆరంగంలోపనిచేస్తున్న కుమింగ్‌టాంగ్ సైనికాధికారి పేరు జనరల్ సి యు-షాంగ్.

"షాంటుంగ్ద్వీపకల్పంలో జనరల్ సి యు-షాంగ్ సైనిక బలాలు అసలు జపానుసేనలకు వ్యతిరేకంగా పోరాడటంలేదు. అంతేకాకుండా జపానువారితో లాలూచీపడి, కమ్యూనిస్టు సైన్యంపై దాడులుసాగించాము.

"జనరల్ సి యు షాంగ్ జపానువారితో మొదట్లో రహస్యసంబంధాలు కొనసాగించాడు. కుమింగ్‌టాంగ్ ఉన్నతాధికారులకుకూడా అది అంగీకారమై ఉంటుంది. కాని రాను రాను సి యు-షాంగ్ ప్రవర్తన శృతిమించింది. బహిరంగంగానే జపాను ఫాసిస్టులతో సంబంధం పెట్టుకోసాగాడు. కుమింగ్

-టాంగ్ నాయకులు ఇరకాటంలో పడిపోయారు. జనరల్ సి యు-సాంగ్ విషయంలో కమ్యూనిస్టులుసాగించిన రాజకీయ ప్రచారం కుమింగ్‌టాంగ్‌కు కంటక ప్రాయంగా తయారైంది. చివరకు కుమింగ్‌టాంగ్ అధికారులు ఒక సైనికోద్యోగిచేత జనరల్ సి యు-షాంగ్‌ను 1940లో చంపించవలసిన పరిస్థితులు ఏర్పడినవి.

"ఆ సంఘటనజరిగిన కొద్దిరోజులకే నేను ఆరంగంనుంచి పారిపోయాను. నాకు తెలిసిన ఒక సైనికోన్నతోద్యోగి సిఫారసుతో మరొకసైన్యంలో చేరాను. ఆసైన్యానికి జనరల్ చెన్‌టూ-చి నాయకత్వం వహిస్తుండేవాడు.

"ఆ సైన్యంలోఉంటూ మేజరు పదవి సంపాదించాను. కమ్యూనిస్టు వ్యతిరేక ప్రచారం జోరుగా సాగింది. 1937 నుంచి 1940 వరకు షాంటుంగ్‌లోనూ, 1942 నుంచి 1944 వరకు కియాంగ్సీలోను, 1944 నుంచి జపాను లొంగుబాటువరకు అన్‌హ్వా రాష్ట్రంలోను కమ్యూనిస్టులకు వ్యతిరేకంగా పోరాడాను."

కలొనెల్ లి పింగ్-చున్ జీవితం విచిత్రవర్తనంలో నడిచింది. ఉపాధ్యాయుడుగా జీవితం ప్రారంభించాడు. జపానును వ్యతిరేకంగా పోరాడాలని సైన్యంలోచేరాడు. కాని సైన్యంలో ఉన్నంతకాలం కమ్యూనిస్టులపైన మాత్రమే యుద్ధంసాగిస్తూ వచ్చాడు.

తర్వాత కుమింగ్‌టాంగ్ సైన్యంలోని ఆచారవ్యవహారాలను గురించి ఆ కలొనెల్ తెల్పిన వివరాలు ఇవి:

"మాకు ఇచ్చేజీతాలతో భుక్తిగడవటంకష్టం. అందుకని మేము ఇతరమార్గాలు అనుసరించి ధనార్జన సాగిస్తుండేవాళ్ళం.

సైనికదళాలలో లేనిసైనికులపేర్లను పైకిపంపి, వచ్చే అదనపు రేషన్‌లు మేము కాజేస్తూ ఉండేవాళ్ళం. సైనికులకు ఇచ్చే జీతాలలో కొంతభాగం మేము మినహాయించుకొనేవాళ్ళం."

ఇకముందు ఏమిచేయదలచుకున్నావు? ఏమి జరుగుతుందని ఆశిస్తున్నావు? అని ప్రశ్నించాను.

"నాజన్మస్థలమైన హోపేరాష్ట్రానికివెళ్లాలని నాకోర్కె. అక్కడ నాభార్య, కొడుకు ఉన్నారు. గత పది సంవత్సరాల నుంచి వారి మొఖాలు చూడటానికికూడా నోచుకోలేదు. మళ్లా కొత్త జీవితాన్ని ప్రారంభించాలనిఉంది."

నేను టీ త్రాగటం పూర్తిచేసాను. కలొనెల్ లి పింగ్-చున్ ఇంకా టీ త్రాగుతూనే ఉన్నాడు.

పూర్తిగా నిరాశ, నిస్పృహలు పొందిన వ్యక్తి, మనో దౌర్బల్యం కలిగినమనిషి నా ముందున్నాడు. పదేళ్ళపాటు ఎన్నో అమానుష కృత్యాలు సాగించాడు. నిస్సహాయులైన ప్రజలను కాల్చి చంపాడు. గ్రామాలను దగ్ధపటలం కావించాడు. చైనా ప్రజలకు శత్రువులైన జపాను ఫాసిస్టులతో చేతులు కలిపాడు. అబద్ధాలను సృష్టించి, ప్రజలను మోసగించాలని చూసాడు. సాటి సైనికులకు న్యాయంగా ముట్ట వలసిన సొమ్మును దిగమింగాడు. అయినా, తాను సాగించిన పైశాచిక కృత్యాలకు అతని అంతరాత్మ పశ్చాత్తాప పడటం లేదు. వందలాది కుమింగ్‌టాంగ్ అధికారులతో కలసి "నలుగురితో నారాయణ"అన్నట్లు ప్రవర్తించా ననుకొంటున్నాడు.

వాషింగ్టన్ బంటుల నైతిక పతనానికి పరిధిఅంటూ లేదని పై ఉదంతం రుజువుచేస్తూంది.

# 2

మిస్టర్ వాంగ్ సి-యన్ క్వీలిన్‌లో ఒక హోటల్ యజమాని. చైనా జాతీయ బూర్జువా వర్గానికి చెందినవాడు. అమెరికన్ పెట్టుబడిదార్ల ప్రయోజనాలకు అనుకూలంగా కుమింగ్‌టాంగ్ ముఠా, చైనా ఆర్థిక జీవనాన్ని ఛిన్నాభిన్నం చేయటంవల్ల నష్టపడ్డ వర్గానికి చెందినవాడు.

కాని, కుమింగ్‌టాంగ్ ప్రభుత్వ చర్యలను ప్రతిఘటించ లేదు. కుమింగ్‌టాంగ్ ప్రభుత్వ విధానానికి వ్యతిరేకత వ్యక్తం చేసినప్పటికీ, ఆచరణలో తన స్వార్థ ప్రయోజనాలదృష్ట్యా ఆ విధానాన్ని పూర్తిగా వినియోగించుకోవాలనీ, డబ్బు ఆర్జించాలనీ తంటాలుపడ్డవ్యక్తి.

కుమింగ్‌టాంగ్ ముఠావల్ల తాను నిజంగా నష్టపడ్డానంటాడు. చైనా అంతర్యుద్ధం ముగుస్తున్నందుకు సంతసం వెలిబుచ్చాడు. చైనాలో ఏకప్రభుత్వం ఏర్పడినందుకు, ఏర్పడిన కొత్తప్రభుత్వం జాతీయపరిశ్రమలకు రక్షణలు కల్పిస్తున్నందుకు సంతృప్తి వెలిబుచ్చాడు.

మరొకప్రక్క సందేహాలు అతన్ని పీడిస్తున్నాయి. తన ఇంటిని కొత్త ప్రభుత్వం లాక్కుంటుందేమో! ఒక చిన్న యంత్రాగారంలో తనకు వాటాలు ఉన్నాయి. ఆ వాటాలను కమ్యూనిస్టుప్రభుత్వం లాక్కుంటుందేమో! అని వాంగ్ సి-యన్ భయపడుతున్నాడు. వాంగ్ సి-యన్ నోటినుంచి వచ్చిన మాటలను వినండి.

"కియాంగ్సీ రాష్ట్రంలో పుట్టాను. నాకు 42 ఏళ్ళు నిండాయి. నా పన్నెండో ఏటనుంచి క్వీలిన్‌లోనే నివసిస్తు

న్నాను. హోటల్ కుర్రాడుగా జీవితం ప్రారంభించి, కష్టపడి పైకివచ్చాను.

"1942 లో క్వీలిన్ జపానుసేనల వశమైంది. నగరాన్ని ఖాళీచేసి వెళ్ళిపోయే కుమింగ్‌టాంగ్ సేనలు క్వీలిన్‌ను పరశురామ ప్రీతికావించాయి. నేనూ నగరం విడిచి పారిపోయి, పశ్చిమ రాష్ట్రాలలో వ్యాపారం సాగించాను. తిరిగి 1945 లో క్వీలిన్‌నగరం చేరుకొన్నాను. నా వద్ద ఉన్న డబ్బుతో రెండు చిన్న మిల్లులను స్థాపించుకొన్నాను. అమెరికానుంచి సహాయం వస్తోందనీ, చైనా అంతటా పరిశ్రమలు "మూడుపూలూ, ఆరు కాయలూ" లాగా వర్ధిల్లగలవనీ అప్పట్లో పత్రికలు ప్రచారంచేశాయి. ఆ ప్రచారంలోని మోసం ఆచరణలో బయటపడిపోయింది.

"ఒక చిన్న యంత్రాగారంలో కొన్ని వాటాలు కొన్నాను. పెద్దభవనం నిర్మించి హోటల్‌ను సెప్టెంబరులో ప్రారంభించాను. అక్టోబరునాటికి నా హోటల్ నిండా కుమింగ్ టాంగ్ సైనికాధికారులు నిండిపోయారు. వారంతా ఉత్తరాది నుంచి పారిపోయివచ్చిన వారే. అసలు నా హోటల్‌లోనే వారి సైనిక కార్యాలయాలు వెలిసాయి! ఎంతకాలానికీ వారు అద్దె చెల్లించటంలేదు. వారితో విసిగివేసారి నా హోటల్ నుంచి ఖాళీచేయమన్నాను. వెంటవే నన్ను అరెస్టుచేసారు. నావద్ద ఉన్న డబ్బును ఇవ్వమని బలవంతం చేశారు. నావద్ద డబ్బేమీ లేదన్నాను. ఎనిమిదేళ్ళ వయస్సున్న నా కొడుకుని పట్టుకొచ్చారు. 'మీ నాన్న కమ్యూనిస్టా' అని ప్రశ్నించారు. కాదన్నాడు మావాడు. వాడిని చితకచావకొట్టి వాడిచేత 'ఔ'

ననిపించారు. నేను కమ్యూనిస్టు అని ప్రత్యక్షసాక్ష్యం దొరికిందన్నారు. తరువాత నన్ను చిత్రహింసల పాల్జేసారు."

తరువాత కుమింగ్‌టాంగ్ కరెన్సీవిలువ పడిపోవటంవల్ల తాను ఏవిధంగా 'నష్టపడిందీ మిస్టర్ వాంగ్ సి-యన్ వివరించాడు. కుమింగ్‌టాంగ్ ముఠా ఎన్ని రూపాలలో ప్రజలను కొల్లగొట్టారో విశదీకరించాడు.

## 3

చీకటిపడుతోంది. సామాను సర్దుకొన్నాను. రేపు ఉదయమే నా తిరుగు ప్రయాణం. క్వీలిన్‌లో ఆఖరిరోజు గడుపుతున్నాను.

వాషింగ్టన్ బాటులను గురించి తెలుసుకోటం ఇంకా పూర్తి కాలేను. కామ్రేడ్ చెన్ సలహా ప్రకారం కుమింగ్‌టాంగ్ పత్రిక తాజా సంచికను తిరగవేస్తున్నాము.

క్వీలిన్ ప్రజాసేన హస్తగతం కావటానికి కొన్ని గంటలకు పూర్వం ఆ సంచిక అచ్చయింది. ఆ పత్రికలోని మచ్చుతునకలు చూడండి:

పెద్ద పెద్ద అక్షరాలతో "క్వాంగ్సి కేంద్ర వార్తాపత్రిక" సంపాదకీయ శీర్షిక: సర్వసేనాని పాయ్ సుంగ్-సి ఇంకా క్వీలిన్ నగరంలోనే ఉంటూ పని సాగిస్తున్నాడు. కమ్యూనిస్టులతో శాంతి సంభాషణలను గురించిన వదంతులు నమ్మటం బుద్ధిమంతుల లక్షణంకాదు" ఆ సంపాదకీయంలో ఇలా ఉదహరించారు: "యుద్ధరంగ పరిస్థితిలో ఎట్టి మార్పు లేదని అధికారపూర్వకంగా ప్రకటించబడింది. శాంతి సంభా

షణాలను గురించిన వదంతులు నమ్మటం బుద్ధిమంతుల లక్షణం కాదు. యుద్ధవ్యూహ రచనలో ప్రపంచ ప్రఖ్యాతి కాంచిన జనరల్ పాయ్ సుంగ్-సి ఉద్దేశాలకే ఆ వదంతులు పూర్తిగా విరుద్ధం. కమ్యూనిస్టులను చివరిక్షణంవరకు ప్రతిఘటించాలన్న ఆయన ఉద్దేశాన్ని ప్రపంచంలోని వివేకవంతమైన ప్రజాస్వామిక దేశాలకు పదేపదే పునరుద్ఘాటిస్తూ చాటి చెప్పాడు."

(ఈ వ్యాసం అచ్చు అవుతున్న సమయంలో పాయ్-సుంగ్-సి చుంకింగ్‌లోనూ, ప్రజాసైన్యం క్వీలిన్ శివార్లలోను ఉన్నాయి.)

మిస్టర్ లి సుంగ్-జెన్ ఆరోగ్యాన్నిగురించి తెలియజేస్తూ ఒక వ్యాసం ప్రచురించబడింది.

మరొకవార్తలో చైనాలో మంత్రివర్గ నిర్ణయాలు ప్రకటించబడ్డాయి.

"ప్రధాన మంత్రి యాన్ సి-షాన్ అధ్యక్షతన జరిగిన మంత్రివర్గ సమావేశంలో సోవియెట్ యూనియన్‌తో దౌత్య విషయాలలో ఏర్పడిన విచ్ఛేదాన్నిగురించి శాసనసభ చేసిన నిర్ణయాన్ని పరిశీలించారు."

(ఆ మంత్రివర్గ సమావేశం అసలు ఎక్కడ జరిగిందో ఆ వార్త తెల్పటంలేదు.)

ఇంకొక మచ్చుతునక :

"క్వీయాంగ్ నగర పతనానికి కారణభూతుడైన క్వీచౌ సైన్యాధిపతి దొంగతనం చేసాడన్న నేరంపై కాల్చి చంపబడ్డాడు."

రెండవ పేజీనిండా చైనా పర్యటనకు అమెరికాశాసన సభ్యులు బయలుదేరారనీ, అలా బయలుదేరినవారి జీవిత విశేషాలతోనూ నింపేశారు.

"కమ్యూనిస్టు బందిపోట్ల కుట్రను వమ్ముచేసి తీరాలి" అన్నవ్యాసంలో ఇలాఉంది: "జనరల్ పాయ్ సుంగ్-సి సైనిక వ్యూహం పుణ్యమా అంటూ శాంతి సంభాషణలు జరప వలసినకర్మ మనకు పట్టలేదు; కమ్యూనిజంపై చావుదెబ్బ కొట్టగలశక్తి మనకు వచ్చితీరుతుంది."

ఆ వ్యాసం క్రిందిభాగంలో—

"అమెరికాలో జనరల్ మెకార్థర్ స్థానం" పై పెద్ద వ్యాసం. "మాస్కో అంతర్జాతీయ విప్లవాన్ని నిర్దాక్షిణ్యంగా వెంటనే అణచివేయాలన్న మెకార్థర్ వాదనను అమెరికాలో చాలామంది అర్థంచేసుకోలేక పోవటం విచారకరం" అని అందులోఉంది.

"క్వేలిన్‌నగరంలో వచ్చే శీతాకాలంలో శాంతిభద్రతలను కాపాడటానికి ఎనిమిది షరతులు" (వచ్చే శీతాకాలం వరదాకా ఇక్కడే ఉండగలమని పగటికలలు కంటున్నారు):

(1) స్త్రీలపై చేయిచేసుకొనే వాళ్ళనూ, దోపిడి దార్లనూ కాల్చిచంపాలి.

(2) నిర్బంధంగా యువకులను సైన్యంలోచేర్చే వ్యక్తులను కాల్చిచంపాలి.

(3) ప్రభుత్వంపై కుట్రపన్నే వ్యక్తులను కాల్చిచంపాలి.

(4) తిరుగుబాటు దార్లనూ, దోపిడిదార్లనూ కాల్చి చంపాలి.

(5) వట్టివదంతులతో ఆర్థిక అల్లకల్లోలాన్ని రేకెత్తిం చిన వారిని కాల్చిచంపాలి.

(6) రహదార్లను ఛేదించేవారిని (ప్రభుత్వ అనుమతి పొందకుండా) కాల్చిచంపాలి.

(7) హత్యలు, సాయుధదౌర్జన్యాలు, దారి దోపిడీలు సాగించేవారిని కాల్చిచంపాలి.

(8) బహిరంగస్థలాలలో జూదం ఆడే వారిని కాల్చి చంపాలి.

బహుశా ఈ బెదరింపులు ఎవరిపైనా పనిచేసిఉండవు.

ఆదివారం పత్రిక కావటాన ఆఖరిపేజీలో 'సాహిత్య' విషయాలు ఉన్నాయి.

ఇదీ క్వేలిన్ కేంద్రవార్తా పత్రిక. క్వేలిన్‌లో ప్రజా సైన్యం ప్రవేశించబోతున్న తరుణంలో పై పత్రిక ప్రకటించ బడింది. ఇక మీ అంతటమీరే ఆలోచించుకోండి.

పై సంచిక వెలువడిన నాలుగురోజుల అనంతరం అదే పేరుతో కొత్తసంచిక బయటకు వచ్చింది. "క్వోంగ్సీ కేంద్ర వార్తాపత్రిక" ప్రచురణకర్త, సంపాదకులు, ముద్రాపకులు అంతా పాతవారే!

అయినా ఆ కొత్తసంచికలో ప్రకటించబడిన విష యాలు, పాత సంచికలో ప్రకటించబడిన విషయాలు పరస్పర విరుద్ధంగా ఉన్నాయి. మొదటిపేజీలో ప్రముఖంగా ప్రకటించ బడిన వ్యాసం: "ప్రజలకొక క్షమాపణ"

"క్వేలిన్‌నగరం విముక్తిపొందిన పర్వదినం తర్వాత, క్వోంగ్సీ వార్తాపత్రిక ప్రథమసంచిక వెలువడుతోంది. లోగడ ఈ వార్తాపత్రిక మూడు కుటుంబాల సొంతసొత్తుగా పరిగ

ణించబడింది. ఈ పత్రికలో పని చేసే మమ్ములను నౌకర్లను చూసినట్లు ఆ మూడుకుటుంబాలవారు చూసేవారు. యదార్థ వార్తలను ప్రకటించటానికి కొంత కృషిచేసినా, ఆకృషి ఫలించలేదు. రానురాను ఈ పత్రికపై ఆ మూడుకుటుంబాల పెత్తనం అధికం కాజొచ్చింది. కనుక గతంలో మా పత్రిక ప్రజలను మోసగించింది. ఆ మోసానికి మేముకూడా కొంత వరకు బాధ్యులమయినందుకు సిగ్గుపడుతున్నాము.

"క్వేలిన్ విముక్తమైంది. ఈ పత్రిక ఆస్తిపాస్తులను రక్షించి ప్రజలచేతికి అప్పగించాలని అనుకొన్నాము. కాని ఆ తరుణం ఇంకా ఆసన్నంకాలేదు. ఈ పత్రిక నిర్వహించవలసిన బాధ్యత పూర్తికాలేదు. ప్రజాశ్రేయస్సుకోసం ఇకనుంచి ఈ పత్రిక పాటుబడగలదని ఎలుగెత్తి చాటుతున్నాము. గతంలో చేసిన తప్పుకు క్షమాపణ వేడుకొంటున్నాము.

"ప్రజల విమర్శలను ఈ పత్రిక హృదయపూర్వకంగా స్వీకరిస్తుంది.

"అసత్యాలకు పేరెన్నికగన్న నాన్కింగ్ కేంద్రవార్తా సంస్థతోగల సంబంధాలను ఈ పత్రిక తెగతెంపులు చేసు కుంటున్నది."

నిజంగా కొన్ని సందర్భాలలో ఏమిచెప్పాలోకూడా మనకు అర్థంకాదు. నిజంగా ఇది అలాంటి సందర్భమే.

క్వాంగ్సీ వార్తాపత్రికలో పనిచేసినఉద్యోగులు కుమింగ్ టాంగ్ దుష్టపాలనతో విసుగుచెందారంటే అందులో నిజం ఉండొచ్చు. కాదనలేము. ఆ ఉద్యోగులు తమ అసంతృప్తిని బయటకు వెలిబుచ్చలేకపోయారంటే, అందులోను సత్యం ఉండిఉండవచ్చు. వారి నిజాయితీని శంకించటం ధర్మంకాదు.

అయితే పత్రికపై పెత్తనం చలాయించే సంపాదకులు, ప్రచురణకర్తలు నిజాయితీపరులని నమ్మటం క్షమించరాని విషయం. ఒక్క రోజులో వారు వేషాలు మార్చగలిగారు.

నిన్నటివరకు ప్రజలపై నిందాప్రచారం; నేడు ప్రజలను క్షమాభిక్ష వేడుకోటం — బాగుందివరస!

ఇరవై సంవత్సరాలపాటు ఈ సువిశాలదేశంలో సాగిన చాంగ్ కై షేక్ పాలన—కాదు దుష్టపాలన—దుర్గంధపూరితమై, భరింప శక్యంకాకుండాఉంది.

జపాను ఫాసిస్టులతో చేతులుకలిపి, చైనా దేశ భక్తులను కాల్చినసంగతి కలొనెల్ లి పింగ్-చున్ చెప్పాడు. కుమింగ్ టాంగ్ ఎన్ని మోసాలుచేసి ప్రజలను కొల్లగొట్టిగుల్ల చేసిందో హోటల్‌యజమాని వాంగ్ సి-యన్ వివరించాడు. ఆ విషయాలు తలుచుకొంటుంటే వళ్లు మండిపోతోంది. అవును, వళ్ళు మండిపోతోంది. నా హృదయంలోని భావాలను వెలిబుచ్చటానికి అవే సరైనపదాలు.

చైనా ప్రజానీకం ఎన్ని కష్టాలకు, నష్టాలకు, మరెన్ని యమయాతనలకు గురైంది! వారు ఎన్ని ప్రాణాలను బలిపెట్టాల్సి వచ్చింది! అమెరికన్ గుత్తవ్యాపారస్థులు ఎన్ని కోట్ల టన్నుల బంగారాన్ని చాంగ్ కై షేక్ శరీరంలోకి ఎక్కించారు!

అయినా కూలిపోతోంది. సర్వం కూలిపోతోంది. కూకటివేళ్ళతో కూలిపోతోంది. షైలాక్ గొంతెమ్మకోర్కెలు, పిచ్చి ప్రణాళికలు విఫలమైనందుకు చైనాప్రజలపై అమెరికాకు ఎంత ఉక్రోషం!

రాత్రిపూట ఆకాశంలో పడమటివైపుగా ఒకవిమానం పోతున్నది. బహుశా అందులో అమెరికా శాసనసభ్యుడు మిస్టర్ నోలాండు ఉండొచ్చు. తైవాన్‌నుంచి చుంకింగ్‌కు సతీసమేతంగా బయలుదేరాడా? బహుశా విమానంలో కూర్చొని జీడీలు నములుతూ ఆలోచించుకుంటూ ఉంటాడు! "చాంగ్ కై షేక్ తోలుబొమ్మలోకి మరి రెండు వేలకోట్ల డాలర్లను 'ఇంజెక్ట్' చేస్తే? కనీసం ఆ శవాన్నయినా కూర్చోపెట్టొచ్చుగా? ఎంతో కొంత మన చేతిలో ఉంటుందిగా? కనీసం రెండు రాష్ట్రాలైనా......"

మిస్టర్ నోలాండ్! అసంభవం! నా మాట నమ్ము. విముక్త ప్రాంతంలోనే ఉన్నాను. ఆకాశంలో విహరించే నీకన్నా, చైనా నడిగడ్డపై ఉన్న నేను ఇక్కడి పరిస్థితులను చక్కగా అవలోకించగలను.

అయినా నా మాట మీరు నమ్మరు. నాకు తెలుసు. చేతులు కాలినతరువాత ఆకులు పట్టుకోనేరకం మీరు!

నేనే కనుక చిత్రకారుణ్ణి అయిఉంటే, వాషింగ్టన్ బంటుల నందరినీ కలిపి ఒక బొమ్మ గీసేవాణ్ణి.—

ఎడమచేతివైపు, చాంగ్ కై షేక్ మొఖంతో కుమింగ్‌టాంగ్ సైనికాధికారి, కమ్యూనిస్టు అని అనుమానించబడిన రైతుగుండెకు తుపాకి గురిపెట్టి నిల్చొని ఉంటాడు.

కుడిచేతివైపు ట్రూమన్ మొఖం వేసుకొని ఒక వాషింగ్టన్ పెద్దమనిషి వాలుకుర్చీలో కూర్చొని చుట్ట కాలుస్తూ, చాంగ్ కై షేక్‌కు పంపేందుకు కొత్త ఋణపత్రంపై సంతకం చేస్తూ ఉంటాడు.

బొమ్మగీయటం పూర్తి అయిన తరువాత, దానిపై X మార్కు పెట్టుతాను.

చైనా నడిగడ్డపై వాషింగ్టన్ బంటులకు, ఆ బంటుల దొరలకు పుట్టగతులు లేకుండా చేశారు, వీరచైనా ప్రజానీకం.

# ఎనిమిదో భాగం

## 1

నా తిరుగుప్రయాణం కొనసాగిస్తున్నాను. ఆ ప్రయాణంలో ఇతఃపూర్వపు స్మృతులు మనోవీధుల్లో మెరుస్తున్నాయి.

హెంగ్‌యాంగ్ చేరుకొన్నాను. కొన్నిరోజులలోనే హెంగ్‌యాంగ్ రూపురేఖలు మారిపోయాయి.

కామ్రేడ్ లిన్ పో కు సుస్తీగాఉందని తెలిసింది. చూసి రావటానికి వెళ్లాను. మంచంపై పడుకొనికూడా తన సైనిక బలాలకు తంతివార్తల సహాయంతో సారథ్యం వహిస్తున్నాడు. కామ్రేడ్ లిన్ పో చివరి వాక్యాలను ఇక్కడ ఉదహరిస్తాను.

"ప్రజాసైనికులు చైనా అంతర్యుద్ధాన్ని సాధ్యమైనంత త్వరలో అంతంచేయాలని ఆతురతపడుతున్నారు. చూడండి! 20 సంవత్సరాలనుంచి నిద్రాహారాలు లేకుండా పోరాడుతున్న వారు ఈ యుద్ధం మూడురోజులు, లేదా రెండురోజులు, లేదా ఒకరోజైనా ముందుగా ముగియాలని కాంక్షించటం సహజమే గదా! పైగా కామ్రేడ్ మావో సే-టుంగ్ కొన్ని సంవత్సరాలుగా మాకు బోధించాడు: సోవియెట్ సైన్యం శత్రు

సైన్యాలను గుక్కతిప్పుకోనీయకుండా దెబ్బతీస్తుంది. దానిని మనంకూడా నేర్చుకోవాలి. ఒక్క రోజుకూడా వృధాకాకూడదు."

క్రెమ్లిన్‌లో సెలవుతీసుకుంటూ చెప్పినట్లుగానే కామ్రేడ్ సుయాంగ్-వెంగ్ లేఖ వ్రాశాడు. ఆ లేఖతో ఈ గ్రంధాన్ని ముగిస్తున్నాను.

నవంబరు 26, 1949

కామ్రేడ్ సిమనోవ్‌కి -

మున్ముందుకే సాగిపోతున్నాము. గతసారి మనం కలుసుకున్నప్పుడు అనేకవిషయాలు మీతో ముచ్చటించటానికి అవకాశం చిక్కలేదు కనుక ఈలేఖ వ్రాస్తున్నాను. అప్పుడూ, ఇప్పుడూ కూడా వ్యవధి తక్కువగానే ఉంది. ఒక ముఖ్యవిషయంమాత్రం ప్రస్తావిస్తున్నాను.

రెడార్మీ అనుభవాలను చైనా ప్రజావిముక్తసైన్యం ఎల్లప్పుడూ అధ్యయనం చేస్తూఉంటుంది. సోవియట్‌యూనియన్‌లోవలె మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంతం సహాయంతో విప్లవ చైతన్యాన్ని, రాజకీయశిక్షణనూ పొందాము. మా సైన్యానికి కూడా మేము అదేవిధంగా శిక్షణ నిచ్చాము. సోవియట్ యూనియన్ ప్రజల జీవిత విశేషాలను తెలుసుకోవాలని అనేక సంవత్సరాలుగా కృషిచేస్తూవచ్చాము. ముఖ్యంగా ఫాసిస్టు వ్యతిరేకయుద్ధంలో రెడార్మీ ప్రదర్శించిన వీరోచిత కార్యాలనుగురించి మా సైన్యానికి బోధించాము. ఫాసిస్టులపై రెడార్మీ సాధించిన ప్రతి విజయాన్ని, కమ్యూనిస్టు సమాజ నిర్మాణంలో సోవియట్‌ప్రజ సాగిస్తున్న నిర్విరామకృషిని కాంచి మా సైనికులు ఉప్పొంగిపోతున్నారు.

రెడార్మీ గడించిన అనుభవాలను పఠించి మేము యుద్ధ నైపుణ్యం అలవర్చుకొన్నాము. అలాగే కమ్యూనిస్టు సమాజ నిర్మాణంలో సోవియట్ అనుభవాలను తెలుసుకోవాలని కుతూహలపడుతున్నాము. సాధ్యమైనంత ఎక్కువ విషయాలు తెలుసుకోవాలని వాంఛిస్తున్నాము. సోవియట్ కామ్రేడ్స్ ఆయురారోగ్యాలను కాంక్షిస్తూ,

ఇట్లు

సు యాంగ్ - వెంగ్.



68



**మనసు ఫౌండేషన్**

**పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA108B112 |
| పుస్తకం పేరు | చైనా వీరగాథలు |
| తారీఖు | 25-10-24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 73 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Sowmya |
| పేజీలు విడదీసినది | Sowmya |
| స్కాన్ చేసినది | Aswini |
| పరీక్ష చేసినది | PRAGATHI |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |